శ్రీరస్తు.

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః.

# ధీరజన మనోవిరాజితము
# శ్రీ విశ్వకర్మ శతకము

గ్రంథకర్తలు :-

1 తెనాలి రామలింగకవి.

2 బండారుపల్లె రామకృష్ణకవి.

తెనాలి కాపరస్తుడు వాడపల్లి గున్నయ్యగారి
తృతీయ పుత్రుడు
ఆయుర్వేదవైద్య:- లింగరాజు చే
ముద్రింపించి ప్రకటింపబడియె.

1928.

వెల 0—8—0

శ్రీరస్తు.

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః.

# ధీరజన మనోవిరాజితము
# శ్రీ విశ్వకర్మ శతకము

గ్రంథకర్తలు :-

1 తెనాలి రామలింగకవి.

2 బండారుపల్లె రామకృష్ణకవి.

తెనాలి కాపరస్థుడు వాడపల్లి గున్నయ్యగారి

తృతీయ పుత్రుడు

ఆయుర్వేదవైద్య:- లింగరాజుచే

ముద్రింపించి ప్రకటింపబడియె.

రజత ప్రెస్, తెనాలి.

1928.

వెల 0—8—0

1

ఓం

ఈ గ్రంథమును రచించిన మహాకవి తెనాలి రామలింగకవి. విశ్వబ్రాహ్మణ వంశజుఁడు తానీషాయను మహమ్మదీయ ప్రభువునకు మంత్రులగు అక్కన్న మాదన్నలకు సమకాలికుఁడుగాఁ గనఁబడుచున్నాడు. అయ్యది నిర్ధారణ మొనర్చుటకుఁ దగిన యాధారములు గన్పట్టవు. ఇంతకుఁ బూర్వము శ్రీకృష్ణరాయల యాస్థాన కవులలో నొక తెనాలి రామలింగకవి గలఁడను విషయము సర్వజన విదితమే! ఆమహాకవియు గూడ నీవంశములోనివాఁడే. యనుటకుఁ గొన్ని నిదర్శనములిప్పటికిని నావంశస్థుల దగ్గరనుండు అముద్రిత గ్రంథ సాంప్రదాయమే ప్రబల సాక్ష్యమొసంగుచున్నది. ఈకవి వంశస్థులిప్పటికిని గుడివాడ దర్శి మొదలగు గ్రామముల యందు కవితా ప్రసక్తిఁ గలిఁగి యశమొందుచుండిరి. అనగా కవిత్వమీవంశ పరంపరానుగత దనుట వింతగాఁ దోఁచదు.

ఇక్కవిత్వము మృదుమధుర శబ్దభూయిష్టమై ద్రాక్షాపాకోప శోభితమై సంస్కృతాంధ్ర భాషాసంపదచే నలరారుచున్నదనుట గర్వోక్తి కానేరదు. సమయానుకూల వర్ణనా చాతుర్యముచే యదార్థమగు దేశచరిత్రను జక్కగ బోధ్యమగునట్లు వ్రాయుట కీతఁడు సర్వసమర్థుఁడనుటకు మనీషావంతులు సందేహ మొందరు.

ఇది తనజాతికి సంబంధించిన చరిత్రయైనను లేనిపోని క్రొత్తగాథలనుదెచ్చి పెట్టి చదువరుల కాయాసమును గల్పిం

చకయు, శత్రులగువారిని నిందాపాత్రులను జేయకయు నిష్పక్షపాత బుద్ధితో దీనిని రచించి నాడనుట విరుద్ధముగాదు

నిశ్చయముగ నాయమరుఁ డాచరించిన మర్మారక్షకృత్యమును విశ్వబ్రాహ్మణు లీదినమువరకును మరచునది గాదని చెప్పక తప్పదు. ఇందలి కథావిషయ మెంతమాత్రమును యదార్థమునకు దూరముకాదు. అమరునివంటి కుత్రిమమంత్రులుండిన రాజ్యపరిపాలనా పద్ధతులుగాని, జాతి మతములుగాని తారుమారుగాకుండ నుండుటకు వీలుండునా

విశ్వబ్రాహ్మణు లిప్పటికైనను పూర్వోన్నత్యమును సంస్మరించుకొని సంఘము పునరుద్ధరింపఁబడవలయునను ప్రయత్నంబుల సల్పుటయందు సఫలీకృత మనోరథులై యిట్టి శిథిల గ్రంథ ముద్రణకై పాటుపడి సంఘశ్రేయమును గాపాడెదరుగాతయని సదా విశ్వకర్మభగవానుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

పండిత. దంతనాల నాగేశ్వరశాస్త్రి.

—[0]—

శ్రీవిరాడ్విశ్వకర్మణేనమః

# ధీ ర జ న మ నో వి రా జి త ము

శా॥ శ్రీరమ్యాబ్జకళావతంస పదరా ♦ జీవార్చనాసక్తులు
ర్వీరా మాధిప ...ర్యసంఘటన ప్రా ♦ వీణ్యాధికారుల్మహా
పారావారగభీరులా శ్రితజన ♦ వాంఛితావనుల్సంతతో
దారుల్మార్దవయుక్తమానసల్గలరుత ♦ త్వజ్ఞానసంపూర్ణులై.

కం॥ అందవు జన్మంబు మాదన
చందన మందారకీర్తి ♦ సంశోభితుఁడై
పొందుగ వ్రగజుఁగని యిం
పొందఁగఁదగురీతిఁ బల్కె ♦ నరువాక్యములన్.

తే॥గీ॥ వసుధ వ్రగజ యెటువంటి ♦ వారికైనఁ
బూర్వనిధి చెప్పరాదెట్టి ♦ పుణ్యులకును
గీఁడొనర్పఁదలంచి యొ ♦ కేఁడల నొకటఁ
డొకటఁడుదయించి వధియించు ♦ నోరులవాఁడు.

కం॥ అక్కన్న నీవు వినుమా
డిక్కరణి ...టూరుల ...చి ♦ యిహజన్మమునం
దొక్కని చేసిన మరణము
నిక్కంబుగ నొందునట్టి ♦ నియతుండైనన్.

వ॥ అదియెట్లంటివేని: బూర్వకాలంబునఁ గర్వితుండనువాఁడు
నిజసచివాగ్రగణ్యుండైన యమరుదుర్బోధనకుఁ జెప్పులొడ్డి

విశ్వబ్రాహ్మణుల నందఱిని వధియించెనని కనకదుర్గ నంత తమ్ముందనకు నిజస్వరూప దర్శనంబిచ్చుఁ గావున నొక్క నాఁటిప్రత్యక్షంబున నెఱిఁగించిన విధంబు విన్నవించెదనని శివభక్తాగ్రగణ్యుండగు మాదన్న నిజాగ్రజుండగు నక్క న్నతో నానందభరిత స్వాంతుండయి యిట్లనియె,

సీ॥ ప్రాకార సౌధాగ్ర ♦ పద్మరాగప్రభా
పటలోరు చుంబితాం ♦ బరతలంబు
సరసపల్లవ పుష్ప ♦ సారసత్ఫలమహీ
దవనీజయుతసదు ♦ ద్యానవనము
చంద్రకాంతోపల ♦ స్థాపితసోపాన
సంయుత విమలకా ♦ సారచయము
సకల వస్తువితాన ♦ సాంద్రశృంగారమం
దిరగణ నివసిత ♦ ద్విజకులంబు

గీ॥ గంధసిద్యంత దానసం ♦ కలితగంధ
సింధుర విహార మతివిపు ♦ లేందు పుండ
రీక బాంధవ వీథులు ♦ వీకనెసఁగు
నిత్యసౌభాగ్యకరము ఫ ♦ ణీంద్రపురము.

వ॥ ఆపురాధీశ్వరుఁడు,

ఉ॥ శ్రీవిలసిల్లు చోళనృప ♦ శేఖరుఁ డెంతయు భీతిరత్నగ
ర్భావలయంబు రాజ్యపరి ♦ పాలన సేయుచు సర్వభోగ భా
గ్యావహుఁడౌ విభుండగుచు ♦ గాఢభుజాంచిత హేతివిక్రమో
ద్రావిత శాత్రవుండగుచు ♦ రంజిలు చుండెఁ గరంబు వేడుకన్.

వ॥ ఆప్రభువునకు బిడ్డలనేకులు సంభవించియు, మృతులగుచుండి నందున,

చ॥ అతనియనుఁగు మంత్రియను ♦ రాఖ్యుఁడు పండిత సన్నుతుండు నం
చితమతికోశ కారకుఁడు ♦ చిత్తమునం దొకనాఁడు భూవరుం
డతులితకీర్తిశాలి కరు ♦ ణామృతవార్ధియటంచు నెంచి నం
తతికిన పాయమయ్యెనని ♦ తానొక చోఁదలపోసె నేర్పునన్.

ఉ॥ అయ్యెడ రాజపత్నికిఁ ద ♦ యంబున గర్భము దోఁచె యానము
ల్చయ్యనమత్తదంతిగతి ♦ చందములై కనుపట్టె నంతటం
దొయ్యలిచన్మొనల్నలుపు ♦ దోఁచె వడిన్నవ మాసపూరితం
బయ్యెను దేహకాంతిపాలు ♦ పారె మహాద్భుతమంచు నెంచగన్

కం॥ గర్భములో వసియించిన
యర్భకుఁ బ్రభవింపఁ జేసి ♦ యందున నాజా
దుర్భరమగు చెరఁ జిమ్మియు
నిర్భయముగఁ బ్రోవరమ్మ ♦ నిఖిలాధీశా.

వ॥ అనియిల్లు పుత్రమోహాతిశయంబున భ్రాంతింపుచున్న యయ్యాలివేణి నయ్యామరుండు సేరి మంత్రిపుంగవుండు గాపున ధరావలయాధీశ్వరుండు వృద్ధుండయ్యె నేసి సంతానంబు లేక యున్న యెడఁ బరరాజులంతి రణరంగంబునం బెనంగొని భూమి నాక్రమించుకొని నంతో పాతిశయంబున ఫణీంద్రపట్టణం బేలుచుండుదు రట్లయ్యె నేని దనపరాక్రమం

బెందుం బొడసూపదుగదా? యని యవ్వనితారత్నంబుతో
ముకుళితకరుండగుచు మాధురీరససంజనిత మృదుభాషణం
బుల నిట్లనియె,

ఉ॥ ఇమ్మహినెంతవింతజని • యుంచెనొకో తెలియంగరాదెయో
యమ్మ! మహర్షివర్యుఁడొకఁ • డద్భుతవృత్తిని టీగుపోసనుం
బిమ్ముటఁజూచి నెమ్మదిని • బ్రేమదలిర్పఁగమాట సామెతన్
నమ్మతిఁబల్కె సత్యమని • సాధులవాక్యము రిత్తపోవునే.

మ॥ అదిమొట్లన్నను దెల్పెదన్వినుముహా • జ్ఞానశక్తిన్ సుధీపై
నుదయంబైన సుతుండు జీవితుఁడుగా • కున్నన్సతీ రత్నమిం
పొదవన్నేత్ర యుగంబు చర్మమునసం • యోగంబొనర్చన్ప్రసూ
తిఁ దగంజూడక యున్న నాశిశువు వృ • ద్ధిం బొందుధీర్ఘాయువై

వ॥ అనియివ్విధంబున మునినాయకుండు తన కెఱింగించి యాం
తర్హితుండయ్యె నని వివరించిన విని యాకంబుకంఠి యట్లైన
బుత్రుండు జీవితుండయ్యె నేనట్లు కానొనర్చెద ననుచు సం
తోషిత స్వాంతయై యుండె నంత,

చ॥ పొరలుమొదంబుచే సకల • భూములలో గుణవృద్ధులైనయ
ప్పురుషను బిల్వఁబంచి నచి • వాగ్రణి ప్రవ్వఁదటాకమధ్యము
న్విరివిగనిత్తునంచుఁదగు • బేరము సేయఁగ నూర్లనుండి వేఁ
దరలియటేగుదెంచియుచి • తంబుగఁబల్కిరి వారలొప్పుగన్.

ఉ॥ ఓసచివాగ్రగణ్య! సుగు • ణోత్తమ! యోయమరాఖ్య! మాదిపే
రాసయెఱింగి యిమ్మెధన • మంతయు దేవరయాజ్ఞచేత వేఁ

జేసెదమాకొలంతపని ♦ శీఘ్రముగానని వారలంతహ
ర్షానమనిర్మలాత్ములయి♦యట్లనెచేయుచునుండిరందఱున్.

సీ॥ అంతనా రాజకు ♦ లాగ్రగణ్యనికూర్మి
కమలాక్షికిఁ బ్రసూతి ♦ సమయమయ్యె
ననుచు నాకలకంఠి ♦ యమరుండు మునుజెప్పఁ
గావినియున్నది ♦ గాన నతఁడు
చతుర్థ్యాగంబునఁ ♦ జర్మంబు సంధించి
గర్భభారంబునఁ ♦ గాసినొందఁ
గాఁజూచిమంత్రిపుం ♦ గవుఁడు దానెఱిఁగించు
విధమొప్పఁజేసెనా ♦ బిసరుహాక్షి

గీ॥ యనుచు నెమ్మదిఁగుందుచు ♦ నమరుఁడార
సాకరము వేడ్కఁ జేయునా ♦ జనులయందు
నవ్యగుణవృద్ధులైన మా ♦ నవులఁజూచి
సరవితోఁబల్కెవారుని ♦ స్మయమునొంద.

సీ॥ గుణవృద్ధులీరలు ♦ కోరినంతిధనంబు
నొసంగెదననిప్రియం ♦ బెసఁగఱుటియుఁ
బలికిమీరున్నట్టి ♦ పల్లెలోవల నెల్లఁ
గాంతలివ్వాడు శీఘ్ర ♦ కాలమందుఁ
బ్రసవమౌదురుగదా ♦ వెసనుదయించిన
శిశువునొక్కనినాకు ♦ నొసఁగుమనిన
నబ్బురపడుచువా ♦ రనిరియోమంత్రిపుం
గవమీకుమాపట్టి ♦ కార్యమేమి

గీ॥ యన్నఁదాఁ బ్రేమదళుకొత్తఁ ♦ జిన్నవానిఁ
బెంచవలెనన్న మోహంబు ♦ మించెననుచు
సత్యముల్వల్కనౌజను ♦ ల్సంభ్రమమునఁ
దెచ్చియిచ్చినసమరుండు ♦ తీవ్రపడుచు.

మ॥ పలికెన్ వ్రజనులార! మీరుతనకీ ♦ పట్టిన్సమర్పించునా
పలుకెవ్వారలతోడఁ జెప్పకనుమీరో ♦ భావించియీపట్టునం
దెలియంజేసినఁ బ్రాణహానియగునం ♦ దేహంబు లేదంచు స
ల్లలితాస్యుండగు బాలుఁదోడ్కొనిచనె ♦ ప్రాజాంగనన్జే
రఁగన్.

మ॥ చనియాశాలకునూడిగంపుసఖుల ♦ న్వాడల్విచారించి సం
జనితామోదముమీరఁగాఁబిలిచిరా ♦ జాత్మాంగనారత్నమిం
పునగన్న స్మృతిఁబొందువానిమదిని ♦ మూర్తిఁగడంద్రోచిగు
ట్టునవీబాలుఁడెకల్గెనంచునటఁ ♦ బట్టిన్బట్టెపల్కుండనెన్.

వ॥ తదనంతరంబాపట్టి నొరులెరుఁగకుండ రహస్యంబుగా మది
నుంచవలెనని కోశకారుండు వివరించినముదితలు మదిఁ
బొదలు సంతసంబున నుండిరంత జనవల్లభ వనితామణి
మృతిబొందిన పిండముఁగనిన పరిచారికాజనంబుసూచి యే
కాంతంబుగాఁ బరిహరించి చారువిగ్రహశోభాయుక్తమైన
శిశువునందుంచినఁ బిమ్మటఁ గనుకట్టూడించుకొని యా
రాజకాంత కపటంబదియని యెఱుంగక నిజంబకాదలంచి
వికసిత వదనారవిందయై నిరీక్షించి వాని నల్ల నల్లన హస్త
కమలంబులంబట్టి యుక్కునంజేర్చి చెక్కిలినొక్కుచు సమీ
పంబుననున్న సఖీజనంబులంజూచి యిట్లనియె॥

గీ॥ నాకుఁగల బిడ్డఁడితఁడె చం ♦ దనసుగంధి
నాకుఁబోఁబుట్టునితఁడెయో ♦ నలిననేత్రి
నాకువిత్తంబునితఁడె ప ♦ న్నగసువేణి
నాకుజీవంబు నీతఁడే ♦ నాగయాన॥

వ॥ అనుచునటనుండ నామావసరంబున సత్కేసుండు హితుల వేఁన ననాశిని మా నందంబునొంది సమస్తభూసురా నీకపరి గణంబులకుఁ బుత్రోద్భవోత్సవంబున నపారధనం బొసం గిన నంత

క॥ తొమ్మిదవ దినమునందును
సమ్మతి నిజపుత్రుతోడ ♦ స్నానంబయ్యె
న్నిమ్ములఁ పదునొకటవ దివ
నమ్మునవారాజువినిత ♦ సంభ్రమునపరుఁడై॥

గీ॥ పుత్రునకు నామకరణంబు ♦ పొలుపుమీరఁ
జేయవలె నంచుఁ బెద్దలఁ ♦ జేరఁబనిచి
హితుల బంధుల మంత్రులఁ ♦ గుతుకమునను
భటుల రప్పించి సంతోష ♦ భరితుఁడగుచు॥

సీ॥ ఒకవంక సతులధీ ♦ యుతభూసురానిక
మొగివేద ఘోషము ♦ లొనరఁజేయ
నొకచాయ భుజవిక్రమోద్ధూత రిపురాజ
బంధువులార్జిజన ♦ మొందిమెరయ
నొకదారి వరభట ♦ నికరముల్ఘనకీర్తిఁ
సంతోష హృదయులై ♦ సాగి పొగడ

నొక చోట భరత శా ♦ స్త్రోక్త క్రమంబునఁ
జెలఁగి వేశ్యలు నాట్య ♦ ములనొనర్ప

గీ॥ రాజశేఖరుఁడతులవి ♦ భ్రాజమాన
మౌక్తికాహారకాంచన ♦ మయవినిర్మి
లాభరణ జాలభూషితుం ♦ డరుగుదెంచి
యరిది కూర్చుండె రత్నసిం ♦ హాసనమున

వ॥ అప్పుడయ్యాలివేణి బాలుండుం దానును శుద్ధోదకస్నానం
బుఁగావించి

సీ॥ నిడుద పెన్నెఱిగుంపుఁ ♦ దడియొత్తి చెంపకుఁ
గానున్న కొప్పు శృం ♦ గారపఱచి
బంగరుకాంతిచే ♦ సంగతంబగుచీని
చీనాంబరంబులు ♦ సెలగఁదాల్చి
నవరత్నమయభూష ♦ ణావళుల్దీరత
లలితాంగములయందు ♦ లంకరించి
కలుకు గుబ్బలమీఁద ♦ గుత్తంబుగా వింత
రంగుల పైఠాణి ♦ రవికెఁ దొడగి

గీ॥ కంఠమున హారములు సక్క ♦ గాధరించి
బాలునకు గజ్జెలందియ ♦ ల్లాలితముగ
వెనలంకార మొనరించి ♦ ముసుగు వైచి
యడ్డముగఁ బట్టికొని వస్త్ర ♦ మమర వైచి ॥

గీ॥ చాతుపతకపద్మ ఘటిత శృం ♦ గారకటక
జనిత ఝుణఝుణ రవములు ♦ చాలమ్రోయఁ

జేడియలఁగూడి యరుదెంచె ♦ నూడిగంపు
సతులు వింజామరంబుల ♦ వితతివీవ ॥

వ॥ ఇట్లువచ్చి పుత్రునిని జకరకమలంబులఁ బెట్టికొని వనితా రత్నంబు దుర్భరంబగు లజ్జాభరంబున జనలోకాధీశ్వరు వామభాగంబున నున్నత పీఠంబునం గూర్చున్న భూదేవ వర్యులు భేరీమృదంగ శంఖతూర్యరవంబులు భోరుకొన రాజు చేతిగణాధిపతికిఁ బూజలు సేయించి పుణ్యాహవాచనం బులు గావించి, బంగారుపళ్లెరంబున ముక్తాహారంబులునించి రాజుచేతికి నామకరణంబు కొరకిచ్చినన నతండు పరమాహ్లా దాపాదిత హృదయుండై॥

తే॥ వ్రాసెనా రాజుముక్తా ఫ ♦ లంబులందు
గర్భకాహ్వయభూవర ♦ ఘనుఁడటంచు
నపుడు భూదేవులలరి శు ♦ భాక్షతములఁ
బొసఁగ నాశీర్వదించిరి ♦ పూర్ణులగుచు॥

కం॥ ఇచ్చిరి మంగళహారతు
లచ్చెరువుగ సతులుగూడి ♦ హర్షముతో శుం
భచ్చతురత రత్నములిడి
వచ్చిన రాజన్యబంధు ♦ వర్గముచూడన్॥

కం॥ పిదపన్నవితామణితో
పదయుండై రాజులేచి ♦ సకలధరాపా
లిథిహిత బంధుజనంబుల
నధికరసాన్నములఁ దృప్తి ♦ నందించి ముదక.

వ॥ రాజబంధు సచివ హితపౌరోహిత జనంబునకున్వేర్వేరఁ దాంబూల చందన దామంబులు సమస్తవస్త్రభూషణంబులు బహుమానంబు లొసంగి వీడ్కొలిపిన వారుఁ బ్రమోదింపుచు నిజనివాసంబులకుఁజని సుఖంబుండిరంత కుమారుండు దినదినప్రవర్ధమానుండై బాల్యాతీతుండగుచు శరశరాసనాద్యాయుధంబులఁ బట్టనేర్చి యుద్ధరంగ ప్రవీణుండై యుండ నారాజశ్రేష్ఠుండొక్కనాఁడు॥

సీ॥ భూమండలంబునఁ ♦ బొలుపారు దివ్యసు
క్షేత్రంబులెల్ల సు ♦ స్థిరముగాను
గనుగొంటిఁగానియా ♦ కనకగిరీంద్రంబుఁ
బొడగానవైతివి ♦ స్ఫూర్తినంచు
నెదఁదలపోసియ ♦ దెవరివల్లఁజూడఁ
గలుఁగునోయనిసభఁ ♦ గలయఁజూచి
పండితోత్తములతోఁ ♦ బలికినఁ బ్రాజ్ఞత
వెలయువారెల్ల శ్రీ ♦ విశ్వకర్మ
తే॥ భూతలంబున నిజశిల్ప ♦ మునను హేమ
పర్వతేంద్రంబు సకలసం ♦ పదలిఁజెలఁగ
నొనరసృజియించినాడని ♦ యూహజేసి
పలికిరిట్లనితద్భూమి ♦ పాలుతోడ॥

తే॥ అరయనాపనితత్సుగు ♦ ణాఢ్యులయిన
వారివలనను దెలియంగ ♦ వచ్చుననుచు
విన్నవించినఁ జోళభూ ♦ విభుఁడుహర్ష
మొప్పగామదినిండు కొ ♦ ల్వుండెయపుడు॥

తే॥ స్వర్ణకారులఁ బిలిపించి ♦ సంభ్రమమునఁ
గనకశైలంబు శ్రీవిశ్వ ♦ కర్మ సేసె
ననుచు సజ్జనులందఱు ♦ వినుతి సేతు
రటని నంతెత మీరల ♦ ట్లగుటఁ జేసి ॥

కం॥ కాంచన భూధర మిపుడే
సంచితమతిఁ జూడవలయు ♦ నంచున్మదిలో
మించె న్వేడుక శిఖరో
దంచిత శైలంబు వ్రాసి ♦ తగఁ దెమ్మనినన్ ॥

వ॥ అంతనా విశ్వకర్మ కులాగ్రగణ్యులందరు నంతరంగంబునఁ
గొంతతడవు చింతించి ॥

శా॥ వన్నెల్మీరఁ బటంబుపైఁ గళలు చె ♦ ల్వారస్ఫుర ద్దీప్యము
ల్చెన్నొందం దగఁ గూర్పి శాస్త్ర విధులం ♦ జేర్పించి విద్వజ్జనం
బెన్నన్శృంగ సమేతమై యలరునా ♦ హేమాద్రి సింగారపుం
జిన్నెల్వ్రాసిరి శిల్పకారకులు చే ♦ జిత్రక్రియా వైఖరిన్.

ఆ॥ వె॥ వ్రాసి యెదుట నిల్ప ♦ రాజశేఖరుఁడును
చిత్రపటముఁ జూచి ♦ చిత్తమందు
హర్షమొదవ విస్మి ♦ తాననుఁడై శిల్ప
కారకులను దాను ♦ గారవించి ॥

ఉ॥ వారలఁ జూచి యిట్లనున ♦ పారకృప స్రధకారులార మీ
రేరి కశక్యమైన పను ♦ లెల్లనొనర్తురుగాన నాకునే
దారినేసైన మేరుగిరి ♦ తన్మహనీయ విలాసముల్దగం
గోరిక మీరఁ జూపుఁడనఁ ♦ గొందఱు వల్కిరి సమ్మదాత్ములై ॥

వ॥ ఓహోరాజననాథాగ్రగణ్యా భవదీయ హృదయంబున హాట
కాచల విలాసంబులు నేత్రపర్వంబుగాఁ గనుంగొను వేడ్క
లుదయించె నేనట్లు కాక యనుచుఁ బ్రయాణంబు కమ్మన
నారాజేంద్రుం డానందభరితుండై విశ్వబ్రాహ్మణ కులాగ్ర
గణ్యులకు బహుమానంబు లొసంగి ॥

కం॥ అయ్యోడజననాథాగ్రణి
నెయ్యంపుఁబుత్రునకు మేది ♦ నీభారముఁదాఁ
జయ్యననర్పణఁజేసియు
నయ్యమరునితోడఁజెప్పె ♦ నతిక్రోధము చేఁ॥

మ॥ అమరుండంతసహింపలేక మునుదా ♦ నార్యప్రమోదంబుగా
నమరంబేర్పడఁజెప్పుచుండిభవదీ ♦ యఖ్యాతిలోకంబు నం
దమరంజేసెద నంతసంబొదవ నా ♦ కాంపేర్మివీసద్వ్యయాం
బమలంబౌక నకంబొసంగుఁడనగా ♦ హంకారచిత్తాబ్జులై॥

కం॥ ననుగనుఁగొని రథకారులు
పెనఁగొనుక్రోధంబుతోడ ♦ బెదరించిరినీ
వొనరించులేమిమాకుల
ఘనమిలజనులనుసృజించు ♦ ఘనుల మొకా మే॥

వ॥ అనియిట్లు నన్నిసడించిన శిల్పకారకులకునాయనుమతి వడ
యక రాజుబహుమానంబొసంగెఁ గావునభూరమణపంచా
నన సంభవుల మదంబడంచెద మదీయసామర్థ్యంబించుక
చూచెదరుగాక యనిమరుఁడు చిత్తంబునందలపోయు
చున్న యనంతరంబున నరేంద్రుండువారిఁ బదునల్గురఁ

దోడ్కొని శుభసూచకంబులెదుర్కొన నాత్మీయపట్టణ ద్వారంబు వెడలి॥

సీ॥ సాలతమాలర ♦ సాలహింతాలపు
న్నాగజంబీరవ ♦ నాళిఁగడచి
గండకభల్లూక ♦ కంఠీరవవ్యాఘ్ర
యుతభీకరాటవు ♦ లుత్తరించి
గంభీరమాధుర్య ♦ జృంభిత రసపూర
వననదీ నివహము ♦ ల్వారుసదాటి
బకచక్ర వాకనం ♦ బంధమౌ కాసార
సముదయంబుల వేఁగ ♦ సరణిదాటి

తే॥ సరవి నొకచోట పాదప ♦ చ్ఛాయ లందు
మార్గ విశ్రాంతులై యుండి ♦ మధురచూత
ఫలములను జాలఁదృప్తిని ♦ జిడసి నడచి
గిరుల, జూచుచు నారాజు ♦ తరలి చనియె

మ॥ కనియెన్రాజుని జాగ్రభాగమునఁదా ♦ ఖద్యోతినోప్పారుస్ప
ర్శనమాత్రంబునజంతుజాలములఁబ్రా♦ పాణస్వరూపంబులం
దనరంజేసి మహాగ్రదీప్తి నలువం ♦ దన్మూర్తి గర్జారవం
బునఁజెల్వారుశిలానది న్ఘనమన ♦ స్ఫూర్తిన్మహాశ్చర్యుఁడై॥

మ॥ తనతోఁడంజనుదెంచువారిఁగనిమో ♦ దంబందుచుంబల్కెనా
జననాథాగ్రణివిస్మితాస్యుఁడయివా♦ క్చాతుర్యయుక్తంబుగా
ఘనవాహాన్వయ జన్ములార! వినరే ♦ గంభీరనిర్ఘోషముల్
మునుపెప్పట్టున నైనఁజూచెదరెత ♦ న్మూర్తిన్విచిత్రంబుగన్॥

వ॥ అనినవిని పౌరుషేయ బ్రాహ్మణుండాశ్చర్యం డాశ్చర్యం బుగా నన్నరేంద్రునితో నిట్లనియె॥

క॥ ఇదిస్పర్శనమాత్రంబు నఁ
గదిసినసంచారమెడల ♦ ఘనశిలరూపం
బొదవించు శిలానదియవుఁ
గుదురుగ దాటంగవశమె ♦ కువలయనాధా॥

వ॥ అనిన రాజిట్లనియె

ఉ॥ కోరికమీర మేరుగిరి ♦ కూటముజూపెదమంచు నన్నునీ
దారికిఁదెచ్చిరాలనది ♦ దాటనసాధ్యమునంగ నర్హమా?
గారవమొప్పనీనది సు ♦ ఖంబుగదాట నుపాయమెద్దియో
మీరుదలంచి చూడుఁడన♦మిక్కిలిచింతనుబొందిరంతటన్॥

వ॥ ఇవ్విధంబున నావిశ్వబ్రాహ్మణ కులరత్నంబులు పదునలుగురుఁ గొంతతడవు చింతించి తమలోఁ దామాత్మగతంబున మనకులదైవంబగు కాళికాంబం బ్రార్థించిన మనోరధ ఫలం బీడేరెడునని నిర్మలజలపూరంబగు పద్మాకరంబున స్నాన సంధ్యా నుష్ఠానంబులుగావించి కరకమలంబులు మస్తకం బునఁగీలించి యిట్లు స్తుతించిరి.

దండకము:-శ్రీమన్మహాకార రేఖా సముజృంభి తాశాంత విభ్రాజమానా! జగన్మోహినీ శాతదంభోళి భృత్కుంభికుంభస్థ లోద్యత్ప్రభాయుక్త వృత్తస్తనీ శుభ్రసత్ఫుల్ల పంకేరుహాక్షీ కళాపూర్ణ శుభ్రాంశుసారాననా కృష్ణజీమూతికేశీ మదో న్మత్తసారంగయానా సుధామాధురీ యుక్తబింబాధరీ శంఖ

చకాస్సి కోదండ పాశాంకుశాంచన్మహాహస్త సంభావ్యమానా మహాత్మామరూపీ । ఇటన్నికటాక్షాం చలంబుల్దగం జూపి మమ్మొక్క తీరంబువేం జేర్పు దుర్గా భవానీ మడానీ । మముం బ్రోవ పూర్వంబుతాం నాద్రికూటంబునందొక్క నాడొప్పుమీ రంగబృందార కల్పాపఘుల్సిద్ధ విద్యాధరేందుల్లిగంగొల్వ శంభుండునున్నీవు బేరోలగింబుండి గీర్వాణులం జూచి మాయిద్దరం దున్నప్రదూపవిశేషాలాసంబులింవారువారెవ్వరో చెప్పుడన్నంత నానిర్జరౌఘుంబు చిత్తంబులో విశ్వకర్మ స్తుతింపంగ నావిశ్వనాథుం డుం గాంచి లాదర్శనుంచె న్విసర్జించి భృత్యావళుల్వెట్టి తేగాను దాపచ్చి మీమోల్ల సిల్పన్విచిత్రంబుగా జూచి సంతోషముం బొంది యావ్వేళ శంభుం డూహా! విశ్వకర్మా! నినున్మెచ్చితిం గోరుకల్దీర్చెద న్వేడుమన్నంతనాలోకనాథుండు కోపించునాకీయ నీవెంతెరాయన్న మృత్యుంజయుండల్లి నీవంశ మండ్రెట్టి పంతంబువాడెక్కడంబుట్టియున్వ్యాలయంబుల్నదాకాచి జీవింతురంచు న్వడి న్శాపమీయంగ నావిశ్వనిర్మాణుం డీశానుం దాంజూచి పల్కె న్భవానీశ ! మమ్మింతదుర్మార్గతింబల్కదా గానసీకిప్పుడేం జేయుగాంగేము సద్భాషణంబుల్గన న్నాకమున్మట్ట స్వరూపంబులే నీకలంకార మాంగాత యన్నంతట న్నీకరాకార ముం బూనియా భర్గుండా విశ్వకర్మన్స్ఫురత్పాద పద్మంబుల న్మ్రొలివిశ్వేశుం డాత్మీయ హస్తంబులంబట్టి వేగంబు నన్లేపి యీరూపమున్నీవె బ్రహ్మంబుగాదంచు నాశంభు దీవింప సంతోష వారాశిలో దేలనీపప్పుడో విశ్వరక్షా! భవ ద్వంశ జాతాళినేనెప్పుడు న్బ్రోతునంచు న్వరంబిచ్చితో । గానసీమాట

సత్యంబు గానిల్పి మమ్మేలుమో కాళికాంబా! నమస్తే! నమస్తే నమస్తేనమః॥

తే॥ గీ॥ అని వినుతిసేయఁ గృపపుట్టి ♦ యఖిలలోక
జననియగు కాళికాంబని ♦ జస్వరూప
మింపు దళుకొత్తఁజూని బ్ర ♦ హ్మేంద్రముఖ్య
దివిజకోటులు గొలువనా ♦ దేశమొందె ॥

వ॥ ఇట్లు ప్రత్యక్షంబయి నిలిచి కాళికాదేవివారి నందఱిఁగటా క్షవీక్షణంబుల నిరీక్షించి యనంతరంబ॥

ఉ॥ మెచ్చితి నేమికావలెను ♦ మిక్కిలిగాఁదగ వేడుకొన్న నే
నిచ్చెదఁద్రుప్తి గావరము ♦ లెల్ల ఘనంబుగ నన్నవారుశుం
భచ్చతురోక్తి నిట్లనిరి. ♦ పావనమైన సువర్ణ పర్వతం
బచ్చెరువందఁ జూపిమము ♦హాయిగఁబంపవె కాళికాంబికా

క॥ అని వేడుకొన్నఁ గాళిక
ఘనవాహన కులజులార ♦ కనకాద్రమదిన్
బెనకొన్న ప్రేమజూపెద
వినయంబున యంబుభక్తి ♦ వేమరుఁ బ్రబలన్

ఉ॥ ఇక్కడనుండి చూడవలె ♦ నీవలనొక్కడు గుంచిచూడఁగా
నక్కడనే యదృశ్యమగు ♦ హాటక శైలమటంచు దేవినా
నక్కజమంది వారలతి ♦ హర్షముతోడుతఁ బల్కిరయ్యెడ
న్మ్రొక్కుచు నిందెచూచెదము ♦ ముందట చూపఁగదమ్మ
కాళికా॥

ఉ॥ అనినవిని కాళికాదేవి మదీయసామర్థ్యంబున వినాయక నంద
ఆకెని రేపుసూర్యోదయకాలంబున మేరుగిరి విలాసంబులు
గనుంగొనఁజేసెదనని యంతర్ధానమైన నావిశ్వభూసురులం
దరునానంద భరితస్వాంతులై రాజునివసించిన వనంబుఁజేరి॥

క॥ నరనాథ మనకువచ్చిన
వరకార్యము సఫలమయ్యె ♦ వగవఁగనేలా
యరమర లేదిక రేపటి
యరుణోదయ సమయమునను ♦ హాటక శిఖరిన్ ॥

క॥ కనుగొందమనుచుఁ బల్కిన
విని చోళ నరేంద్రుఁడమిత ♦ విభ్రమమును దృ
ప్తిని బడియు శయన మొందెను
బనివడి వారంత నిద్రఁ ♦ బడసిరి వేడ్కన్

గీ॥ ఇట్లు శయనించి చోళన ♦ రేంద్రుతోడ
లాలితంబుగ వారుషః ♦ కాలమునను
లేచి కాసారతోయము ♦ లూనుచియందు
స్నాన సంధ్యాదికములెల్ల ♦ సరవిదీర్చి

వ॥ నరనాయకునిం దోడ్కొని తొలుతఁ గాళికాదేవి ప్రత్య
క్షంబయిన శుద్ధసలంబునకుం జనిన నక్కాళికాదేవి
ముప్పదిరెండు యోజనములయున్నతంబునం తియంబువిస్తీ
ర్ణంబును గలిగి దానియందుఁ బుష్పిత ఫలిత నానావిధ
మహీరుహ సందోహంబులును శుకపిక చక్రవాకబక
మరాళవిహంగ కదంబనివసిత నిర్మలామృత సరోవరంబు

లుంగల జాంబూనదాద్రి రూపంబునుబూని దేదీప్యమాన
మైకనుపట్టిన రాజేంద్రుండు గనుంగొని॥

ఉ॥ కన్నులకింపుగాఁ గనిసు ♦ ఖాంబుధిఁదేలి నరేంద్రుఁడిట్లనె
న్నన్నన విశ్వకర్మకుల ♦ మండిత భూషణులార! మీరునా
కున్నమనోరథం బొనరఁ ♦ గూర్చితిరిత్తరి గానఁ జూడఁ బే
ర్మిన్నరలోక దైవములు♦ మీరలటంచుదలంచిమెచ్చుచున్॥

గీ॥ స్వర్ణకారక వరులార ♦ సరవినాదు
కోర్కెలీడేరె నికనుండఁ ♦ గూడదనుచుఁ
బట్టణం బెట్టులున్నదో ♦ బాలుపాలు
చేసివచ్చితి మఱియయ్యొ ♦ వానరములు॥

వ॥ అనుచుఁజోళ పార్థివుండు రథకారులంతో మరలిచనుదెంచు
చున్నంత నిక్కడరాజుకుమారుఁడు దననగరమ్మునను్న
స్వర్ణకారకులను రావించి కిరీటంబొండు నిర్మించి తెమ్మన్న
వారలందరు సంతోషంబునఁ గురువింద వజ్రమౌక్తిక మరక
తేంద్ర నీలవైడూర్య పుష్యరాగ విద్రుమ గోమేధిక నవ
రత్న ఖచితింబగు మకుటుంబు నిర్మాణంబొనర్చి తెచ్చి
యిచ్చిన నృపసుతుండు సంతోషభరితుండయి సభాస్థానం
బున నునిచియుపురునిం బిలువఁబసిచిన నమనుండంతయు
విని వీరినుక్కడగింప నిదిసమయంబని తలంచుచున్న నాతని
జనని విని యిట్లనియె॥

సీ॥ ఆత్మజ నీవుము ♦ న్నమరంబుఁ జెప్పచో
స్వర్ణకారులతోడ ♦ నిర్ణయముగఁ

గలహించి దూషింప ♦ గడఁగఁగ వ్యక్తంబు
నను గీటకంబులు ♦ మునుజనించి
దుర్గంధ మొదవఁగాఁ ♦ దోడ్తోడఁ జెప్పిన
విని విశ్వకర్మను ♦ వినతిసేయ
నతని సత్కృపచేత ♦ నదివాయ సుఖముండి
తత్కుల ద్రోహంబుఁ ♦ దలచితంట

గీ॥ యుక్తమగునయ్య విడువుమ ♦ టుడుగవేని
హానికరమగు నీకని ♦ పూనిపలుకు
తల్లిఁగన్గొని కోపించి ♦ బల్లిదంపు
నృపతిఁ గన్గొనఁ జనెనేగఁ ♦ గుపితుఁడగుచు॥

గీ॥ పోయియమరుండు నీకులం ♦ బునకు సాటి
తగినమకుటంబు ధరియింపఁ ♦ దలచితౌర
విశ్వకర్మవంశజు లెంత ♦ వెడఁగులకట
నీకునాకును బ్రాణ హా ♦ నికె తలంప్రు॥

గీ॥ అనినరాజకుమారుఁ డ ♦ త్యద్భుతముగ
మంత్రిపుంగవ యేమి దు ♦ ర్మార్గమిదియొ
తెలుపవేయన్న మేదినీ ♦ వలయనాథ
తనయా! వినుమది నివు తా ♦ త్పర్యమునను॥

మ॥ తొలినీ పుష్పరవానిబిడ్డఁడవు నిన్ ♦ దోరంబుగాఁ దెచ్చితో
య్యాలికేనిచ్చితిగోప్యమిద్దిమతినా ♦ యాజ్ఞన్మరుంగామెభూ
వలయాధీశ్వరు పుత్రుఁడంచు మనుజు ♦ ల్వాక్ప్రౌతురీయుక్తిపెం
పలరంబల్కుదురయ్య! నీజననమే ♦ వ్వారున్నెనంజాలమిఁక॥



గీ॥ కనకాంగ్యావిశ్వభూసురు ♦ లట్టివరమునఁ
గులముమకుటంబువలననే ♦ తెలియఁజేసి
రయ్యెయ్యెట్లనఁదెలిపెద ♦ నయ్యవినుమ
టంచుఁదన ప్రేలఁజూపుచు ♦ నమరుఁడనియె॥

గీ॥ లక్షితస్వపమతనీకుల ♦ లాంఛనమ్ము
లన్నియున్నవి మకుటంబు ♦ నందెమిగులఁ
జుట్టకుదురిదియే పారఁ ♦ జూడువాండ్ర
కపటవృత్తి యధార్థంబు ♦ కానవచ్చు॥

వ॥ కావున నీసహాయంబున పౌరుషాదుల నందఱిని వధియింప
కున్న నిలుకులంబిట్టిదని లోకులెఱింగినపిమ్మట నపకీర్తియౌనని
యమరుండు దెల్పిన విధి రాజకుమారుం డాగ్రహించి
యుద్దండభుజ విక్రమంబున స్త్రీపురుషాదుల వారి సందఱిని
సంహారంబొనర్చిన॥

క॥ అమరుఁడుతనకోరికయా
సమయమ్మునఁదీరెనిఁకను ♦ సమరంబున భూ
రమణుని మడమడఁచెదనని
భ్రమఁజొక్కియతండువల్కె ♦ రాజాత్మజుతోన్॥

సీ॥ రాజశేఖరసనీవు ♦ రధకారకులనెల్లఁ
గదిసిత్రుంచిన మాట ♦ పదునలుగురు
వినియు మిత్రేంద్రుతో ♦ వివరించి తెల్పిన
వారుజాంబూనద ♦ పర్వతంబుఁ
గనుఁగొనఁజేసి నా ♦ రని వారియందు స

త్కృప మదిఁగల్గితాఁ ♦ గినుకవచ్చి
నేర్పుగాఁ జేయుండి ♦ నిన్నునన్నునుగూడఁ
దలఁద్రుంచి వైచు స ♦ త్యంబుమమ్మి॥
తే॥ మరియు నదిగాక మేదినీ ♦ మండలమున
జనకునిఁద్రుంచి కొడుఁకు రా ♦ జ్యంబు నేలు
ననుచు మీరాజనీతియు ♦ వినమెమునుపు
మనమె యెదురేగి నృపుఁబరి ♦ మార్పవలయు॥
క॥ జననాథాగ్రణి యిత్తరిఁ
గనకాద్రి విలాసమలరఁ ♦ గన్గొని ఘనవా
హన కులజులతో నిచటికిఁ
జనుదెంచుచు నున్నవాఁడు ♦ సంతోషమునన్॥
క॥ అనిన న్రాజకుమారుఁడు
విని జనకుని మీఁదదండు ♦ వెడలెదననుచు
న్బనివడి చతురంగ బలం
బును సిద్ధముచేసి రాజ ♦ పుత్రుఁడు పిదపన్॥
సీ॥ సురగజంబులమీరు ♦ సొగసుగుల్కెడు మత్త
మాతంగవరములు ♦ మలసినడప
రవి హయోత్కటవేగ ♦ మవలీల నిరసించు
హయములెల్లెడఁబర్వ ♦ హయములు గులుక
మేరుమందర శైల ♦ సారముల్వెదళించు
నందమౌ రథములు ♦ సందడింప
విచ్చుకత్తులచేత ♦ విఱ్ఱవీగుచు వేగఁ
బయలు దేరెడుపేర ♦ భటులుసెలఁగ॥

గీ॥ వీరశృంగారములతోడ ♦ భేరులాలయ
మంత్రిపుంగవుతోఁగూడి ♦ మత్సరమునఁ
దండ్రిమీఁదికి దండెత్తి ♦ తనయుఁడపుడు
వెడలెఁ గరవాలహస్తుఁడై ♦ వినయముడిగి॥

తే॥ పురజనులూహించి యీరాజ ♦ పుత్రుఁడకట
యీమరు దుర్బోధవిని మున్న ♦ హంకరించి
స్వర్ణకారకులందఱి ♦ సరవిఁ ద్రుంచి
తండ్రిమీఁదికి నిపుడు వే ♦ దండు వెడలెఁ

వ॥ ఇట్లనుచుఁ బౌరజనంబులంత భయభ్రాంతులై యున్న సమయంబున॥

సీ॥ అంతటఁ జోళ భూ ♦ కాంతుని తోనున్న
రథకారులందఱీ ♦ విధముఁ దెలిసి
నరనాథ కర్వకుం ♦ డరయ నువ్వరవాఁడు
మావారి నందఱి ♦ మకుట మొకటి
నిర్మించి తెండన్న ♦ నేర్పుననవరత్న
ఖచిత కిరీటంబు ♦ గరిమఁ జేసి
యిచ్చిన నమరుఁడ ♦ నచ్చెరువొందుచుఁ
దొంటి వైరముమదిఁ ♦ దోపఁ జెప్పెఁ॥

ఆ॥ గర్వకాఖ్యనీను ♦ కడపటికులమును
బయలుపరచి రకట ♦ నియతిఁదప్పి
స్వర్ణకారజనుల ♦ నిర్ణయంబుగఁ జంపు
మన వధించె నస్మ ♦ దన్వయముల॥

వ॥ కర్ణకుండుకన్నుల కావరంబున స్త్రీపురుషాదుల నందఱినివధి యించిచతురంగబలసమేతుండై మనల నందఱిని వధియింప దండు వెడలినాడు గాన మనమందఱు మిచ్చటనుండి యెట్లు యిన బ్రతికెదమన రాజుచింతాక్రాంతుండై యొక్కింతవడికి మనమందఱము నొక్కచోటనె యుండుదమని సూదికొండ చెంత రథకారకులతో రాజేంద్రుండు కలిసి వసియించి యున్నసమయంబున॥

క॥ కొన్నిదినంబులకును బా
హోన్నతి నాకర్ణకాఖ్యుఁ ♦ డుగ్రాటవిలో
న న్నగములు గడచియుఁ
దాఁబన్నుగ నరదంబుడిగ్గి ♦ బలపరివృతుఁడై॥

వ॥ ఇట్లు రథావతరణంబు చేసి కర్ణకుండతి చటులదోర్దండ విక్రముఁడై కురంగసంగతిఁగల్గు తురంగంబునెక్కి నిశిత ఖడ్గంబు వర వెడలించి జళిపించుచు ననతి దూరంబునఁ దన జనకునింగని యమరునితో నిట్లనియె॥

తే॥ కోశకారక! రథకార ♦ కులనుగూడి
రాజుకలఁడదె చూడుదో ♦ గర్వమునను
దుమికి యెదురేగి వారిని ♦ ద్రుంచివైతు
ననిన రాజసుతుంజూచి ♦ యమరుఁడనియె॥

సీ॥ అల్లనల్లననేగి ♦ చల్లని మాటల
వల్లఁ జిత్తంబు రం ♦ జిల్లఁజేసి
రాజ కార్యంబు వి ♦ భ్రాజితంబుగఁ దెల్పి
సమ్మతి బ్రభనుపుట్టఁ ♦ జనువొనర్చి

నయమార్గానుండి ♦ ప్రియభాషణంబుల
నొద్దిక నొకకొంత ♦ ప్రొద్దుగడపి
మనమందలమునుగూడి ♦ మరలి యేతెంచుచో
మార్గంబు నను బరి ♦ మార్పవలయు॥

గీ॥ మనము దుమికుచుఁ బోయినఁ ♦ గనిపథింపఁ
జూచినారని వారలు ♦ సూదికొండ
బిలముఁజొచ్చిన సాధింప ♦ నలవికాదు
మనకుఁ జోళనరేంద్రనం ♦ దన నిజంబు॥

గీ॥ అనిన రాజేంద్ర నందను ♦ డమరుఁజూచి
పలికె మచ్చిక యొనరించి ♦ తలలుద్రుంప
రాజ ధర్మంబు కాదని ♦ రథకరీంద్ర
తురగ భటయుక్త సేనతో ♦ నరుగుదేర

వ॥ అక్కడఁ బదునల్గురు నరనాయకునిఁజూచి యిట్లనిరి॥

క॥ అంచెలఁ జేరఁగవచ్చెను
గొంచక మీపుత్రుఁడకట ♦ ఘోటకధాటి
న్మించి "మనమస్తకంబులు
ద్రుంచుటకై; నిల్వఁదగదు ♦ దోర్బల విభవా

తే॥ ఇంతకంటెను బూర్వమీ ♦ వింతయైన
దండయాత్రలు సేసిరే ♦ దుండగమున
దారివిడి పారఁ బ్రాణము ♦ లక్కఁగలవు
చనుట మేలన రాజుతా ♦ సమ్మతించె

వ॥ కావున నిఁక నీచోటనిల్వఁగూడ దటంచు నరనాయకునిం
దోడ్కొని యీసమీపంబుననున్న నూదికొండ బిలంబునఁ
జొచ్చిన నిక్కడ రాజకుమారుఁడు వారుపోవుట నిరీక్షించి
చతురంగ బలసమేతుండయి రోషంబునం బరువిడి పర్వత
సమీపంబున కేగుదెంచిన నిజశస్త్రాస్త్రంబు లమ్మహీధరం
బున లీనంబులయ్యె నవ్విధము భూధరోపరిభాగంబుననున్న
పౌరుషేయ బ్రాహ్మణులు పనులుగూరు రాజానుమతిఁబడసి
విస్తీర్ణతరంబులైన పాషాణంబులు పెకలించి భుజబలోద్ధతి
దొరలించిన మేఘుద్యోతిచయంబు భూపతనంబగు కైవడి నా
పర్వత శృంగభాగంబునుండి పతనంబయిన యుపలంబుల
క్రిందఁబడి కళేబరంబులు నలినలియై కొంతబలంబు నశించె
నంతఁ గర్వకుండు పరాజితుండయి యమునుండు నుందాసును
ముఖకమలంబులు ముకుళింపఁ గళాహీనులై దైన్యంబు
నొంది కొదవ బలంబుతో మరలి కొంతకాలంబునకు నిజ
పురంబుఁ బ్రవేశించి భయభ్రాంతుఁడై రాజ్యంబేలుచుండె
నంతనిక్కడఁ బర్వత గుహాంతరమున నున్న స్వర్ణకారకుల
నెల్ల నిరీక్షించి చోళభూపతి యిట్లనియె॥

సీ॥ రథకారులార యీ ♦ కుధరమందున శస్త్ర
మందలి తాకక ♦ యుండు టేమి
యనవారిలోనగు ♦ నాఘ్న్యుఁడొక్కఁడు చోళ
నరపాల! తెల్పెదఁ ♦ బరగ వినుము
మునుపొక్క భూపాలుఁ ♦ డనుపొంద వేటాడఁ
జతురంగ బలముతోఁ ♦ గుతుకమలరఁ

జను దెంచి యాడవిక్తి ♦ సకలన్మృగంబుల
జతనంబుతో వేఁగ ♦ సంహరింప

తే॥ నెమ్మినీగిరిపైఁ దపో ♦ నిష్ఠనున్న
మానులిదిసూచి కోపించి ♦ మానసమున
నెవ్వఁడో వీఁడుపరిమార్చె ♦ మృగచయంబు
ననుచుఁ గించిత్కరుని(జూచి ♦ యనిరి మునులు

సీ॥ కించిత్కరుఁడ నీవు ♦ పొంచిమృగంబులఁ
ద్రుంచి వధించుట ♦ మంచిదగునె
యనవిని యారాజు ♦ కనలుచుఁ గనిముని
నాథులతోఁ దన ♦ నగరమంత
పాడుచేసిన వవి ♦ ప్రతిదినంబునువచ్చి
గోగణంబును జంతు ♦ కోట్లనెల్లఁ
బట్టిమింగుచు సింహ ♦ భల్లూక శార్దూల
మృగములు మరలి యీ ♦ నగముఁజేరి॥

తే॥ యుండియేరికిఁ జూపడ ♦ కుండు దుష్ట
జంతువులఁ ద్రుంచు టే నాకుఁ ♦ బంతమనుచు
సంహరింపుచు నున్ననా ♦ సంయమీంద్రు
లధికరోషంబు నను బల్కి ♦ రధిపుతోడ

తే॥ ఇదిమొదలు ఖడ్గపాణివై ♦ యెవ్వఁడేని
నిందువచ్చిన నాయుధ ♦ బృందమెల్ల
దీనిలో లీనమౌనని ♦ మానులిట్లు
శాపమిచ్చిన నారాజు ♦ కోపముడిగి

తే॥ ఖడ్గబృందంబులెల్ల నా ♦ కరణిలీన
మైనఁగించిత్కారుఁడు దుఃఖి ♦ తాత్ముఁడగుచుఁ
జనెననుచు విన్నవించిన ♦ విని నరేంద్రుఁ
డపుడు రథకారవరులతో ♦ ననియెఁబ్రీతి

వ॥ ఇట్లుమునిగణ శాపరూపంబున నాయుధంబులు దీనియందు లీనంబులగునని యెఱింగించితిరి యీగిరీంద్ర నామధేయంబు తెలియదయ్యెఁ దెల్పుమన శిల్పకారుండిట్లనియె॥

కం॥ మునుగాలి పూజనగమిది
మునిగణ శాపంబువలన ♦ ముద్గరముఖస
ద్ఘనశర శస్త్రౌఘంబులు
తనలో లీనంబు గాఁగ ♦ ధరణీంద్ర మిలక

తే॥ సూదికొండను పేరిటఁ ♦ జూడనొప్పె
నరిది యీశైలవైభవ ♦ మరయదీని
తోటియేగిరి విభవంబు ♦ సాటిరాదు
క్షీరకాద్యను మొకటి యీ ♦ సీమఁగలదు॥

వ॥ ఆక్షీరకాద్రుమ మహిమంబెట్టంటివేని గాఢాంధకారచ్ఛాయాపిరాజితంబును సకల మునిజనానంద కరంబును శుక పిక నికర కోలాహలంబునయి యుండు నీవృత్త రాజము నందెవ్వరేనియు నివసించి యున్నవారికి నాహారసుఖవ్యవస్థానంబనియగునని వివరించినవిని యాశ్చర్యము నొందుచు రాజేంద్రుండు శిల్పకారకులతో నిట్లనియె॥

చ॥ చటుల పరాక్రమస్ఫురణ ♦ చాలఁ బహించు మృగేంద్రగండక
స్ఫుటపటుపుండరీక వృక ♦ పూరితసైన్యమహోగ్రపర్వతో
ద్భట గుహానుండ నేల మన ♦ పట్టణసీమకు నేఁగి కర్వకో
ద్భటపటు గర్వముం జెఱిచి ♦ పాలన సేయను పాయ మెద్దియో

ఉ॥ మిమ్ముల నందఱిం గలిసి ♦ మేరుధరాధర రాజ సద్విలా
సమ్ముల సూడ నేనకట ♦ సమ్మతి దోడ్కొని వచ్చినం గదా
ముమ్మరమూని కర్వకుఁడు ♦ భూరిమదోద్ధతిమీకులంబురో
సమ్మునఁ ద్రుంచెఁగా నరభ ♦ నమ్మున వానివధించు టెట్లొకో॥

తే॥ కర్వకుని మీరు వంచించి ♦ దర్పమొసఁగ
నవ్యసింహాసనమ్మున ♦ నన్ను నునుప
మీరు కోరిన ద్రవ్యము ♦ ల్మెర మీరఁ
బరగనిచ్చెద మీకని ♦ పలుకుటయును

సీ॥ అనవిని రథకారు ♦ లందొకఁ డఁసు గుణాఢ్యుఁ
డనె వేడ్కఁ దనబంధు ♦ జనులఁ జూచి
కర్వకు నిప్పుడు ♦ ఖండనఁ జేయును
పాయంబు తోఁచెనా ♦ భావమున న
దెట్లనఁ దెల్పెద ♦ వినకులాధీశ్వరుఁ
డగు రామ రావణా ♦ హవవిచిత్రి
కథఁ జేసి ఘనదారు ♦ కావిగ్రహంబులు
పురుష ప్రమాణము ♦ ల్కరియొనర్చి

గీ॥ పట్టణంబుల కేగినఁ ♦ బార్థివేంద్రు
లవని నెన్నఁడుఁ జూడలే ♦ దనుచు వేడ్కఁ

జూచి యాడించి పాడించి ♦ చోద్యమునను
మెచ్చిబహుమతులొసరింప ♦ రిచ్చసకుచు॥

కం॥ వినికర్పకుంజు ముదమునఁ
గనవలె నిదియొపుడు లేని ♦ ఘనవిద్యనుచుం
బనివడఁ బిలిపించుమన
కనుకూలము దీనివలన ♦ నగునని వేడ్కన్॥

వ॥ అత్తెఱంగునం బురుష ప్రమాణంబులయిన విగ్రహంబులు నేసి మనమందిరముఁ బ్రతిరూపంబులు వహించి శ్రీరామ విగ్రహాకారంబున ఖడ్గంబు సంధించు నొకవిగ్రహంబు గర్భంబునఁ జొళభూపతిం జొరంజేసి రావణాసురుని వధించువిధంబున సింహాసనమందున్న కర్పకుని శిరచ్ఛేదనం బొనరించుటకు సుఖాయుంబిదియని వివరించి యీబిలంబుననుండి విగ్రహంబులఁ జేయుట కసాధ్యంబు గాన నింకొక్క గృహాంతరంబున కరుగుదుమనిన రథకారులు సంతోష భరితాంతరంగులై

ఉ॥ భూవరుతోఁ సుధామధుర ♦ పూర్ణసుభాషణయుక్తి పెంపున
స్జీవదవాహవంశజులు ♦ చెన్నుగనీగిధమంత తెల్పుచు
న్వారిరిసూదికొండ ఘన ♦ వైఖరితోవిడనాడియుక్కశై
లావనిఁ జేరియుండిరటఁ ♦ హర్షముతోడుతవారలందఱున్॥

వ॥ ఇట్లుండి

ఉ॥ పూర్ణకళావిశేషముల ♦ పొల్పుగొలంగుముఖంబులున్ను వి
స్తీర్ణవికాసనేత్రనర ♦ సీరుహముల్మృదులాంచితప్రభా

కీర్ణవిలాసమూర్తి రుచిఁ ♦ గీల్కొనుచెక్కులునవ్వులున్మహా
ద్వర్ణములున్సజీవముల ♦ వావిరిఁగల్గనొనర్చిర య్యెడన్॥

సీ॥ చండప్రచండదో ♦ ర్దండమండితరామ
లక్ష్మణమూర్తుల ♦ లలినొనర్చి
సుగ్రీవహనుమంత ♦ శోభితాంగదనీల
వగనలప్రముఖ వా ♦ నరబలంబు
రావణకుంభక ♦ ర్ణవిభీషణేంద్ర వి
జయ విగ్రహంబుల ♦ సరవిఁదీర్చి
భీకరాకార శో ♦ భితమత్తదోర్గర్వ
మసమాన సర్వ రా ♦ క్షసబలంబు

తే॥ సరసపురుషప్రమాణము ♦ ల్వరగఁదీర్చి
మణిశరశరాసనంబుల ♦ వరవిచిత్ర
విగ్రహంబులఁగావించి ♦ వేడ్కమీరఁ
గనరుపాంగమృదంగ సం ♦ గతులుసెలఁగ॥

తే॥ పంచవన్నెల బొమ్మలఁ ♦ బరగఁదీర్చి
జనపతికి మారు వేసంబు ♦ సంఘటించి
తాముచేసాంతరంబులఁ ♦ దాల్చిపిదప
సకల నగరంబు చుట్టు వారు ♦ సరగఁబోయి

వ॥ ఇట్లుచేరంబోయి ప్రభుదర్శనంబులు గావించిన॥

ఉ॥ అంతట రాజులెల్ల నతి ♦ హర్షముతోనిది ధారుణీస్థలి
న్నంతసమొప్ప నెవ్వఁడును ♦ జాలఁ గనుంగొనలేదుకన్నుల
న్నింతగఁ దోచెనివనులు ♦ విశ్వనిధాన కులాగ్రగణ్యులా
రెంతయు నొప్పఁగాని వరు♦ లెవ్వరికెన్న నసాధ్యమేక దా॥

వ॥ అనియివ్విధంబున విశ్వకర్మ కులాగ్రగణ్యుల శిల్పచాతురికిఁ బ్రమోదింపుచు రాజశ్రేష్ఠులా విద్యావిలాసంబులు గనుంగొనవలెనని వివరించి సింహాసనాసీనులై పరివార జనంబుతోఁ గొలువుండిరప్పుడు

తే॥ స్వర్ణకారక వరులంత ♦ సంభ్రమమున
మురజనిర్ఘోష ముల్దివి ♦ భోరుకొనఁగ
సరస సాహిత్య సంగీత ♦ సంగతులను
బొమ్మలాడించిరిల వినో ♦ దమ్ముగాను

ఉ॥ ఆడిన జూచి రాజవరు ♦ లందఱు నెమ్మది సంతసించిఁరు
న్వీడని ప్రేమఁబూనియాట♦ విభ్రమమంచు దలంచియుర్వరం
జూడని యీవినోదములు♦సొంపువహింపనటింపఁజేయుటల్
పౌఢతనంబుగా దెయని ♦ వారలమన్నన చేసిరత్తరిన్

వ॥ నబహుమానంబుగా ఘనసార చందన సుగంధ వస్తువులాదిగానిచ్చి పిదపఁ దాంబూలంబులు సమర్పించి కొంచనాంజరా భరణంబుల సరదినొసఁగి యిట్లు రాజశ్రేష్ఠులు బహుమానంబులిచ్చి వీడ్కొలిపిన రథకారకులంద రానందంబులొందివారి యాజ్ఞఁగైకొని యనేకరాజసంస్థానంబుల నిట్లుప్రవర్తింపుచున్న సమయంబున॥

ఉ॥ కర్పకుఁడొక్క నాఁడమరు ♦ గాఢమతిం బ్రకటాస్త్రవర్గమి
ద్దేర్పడఁజెప్పగా వినిమ ♦ హిన్ధలి నెన్నఁను లేని వింతఁదా
నేర్పుగఁ జూడఁగోరుమది ♦ నిశ్చయమున్నఁటికైనఁదీరునేఁ
డీర్పరులైన వారలను ♦ దేశమునిద్యలు చూపుమంచుటల్॥

వ॥ అనిమనంబునఁ జింతించి కర్పకుండ మదుంజూచి యిట్లనియె॥

చ॥ అమరుఁడ వింటివేయుపుడఁ ♦ టబ్బురపాటుజనించెసర్వభూ
రమణులచెంత రామవర ♦ రావణయుద్ధ కథాప్రసంగముల్
ప్రమదముతోడఁ దెల్పుచుఁబ్ర♦భావముఁజెప్పుచుబొమ్మలాట
లీనమయమునందెసంగుచుఁసమ్మతిమీరఁగ దోచెనామదిన్

కం॥ కావున వారేపురమున
ప్రావీణ్యతనున్న వారో ♦ పరిచారులచే
రావింపుమనిన నమరుం
డావాక్యమువిని యుఁగింక ♦ రావళితోడన్

తే॥ పలికెఁ బరిచారజనులార! ♦ పట్టణంబు
లెరిఁగి తిరుగుచు బొమ్మలా ♦ డించు వార
లెడనున్నారొ తోడ్తెండి ♦ యిచటికనినఁ
జిత్తమంచునువారు స ♦ ద్భక్తిఁ జనిరి॥

వ॥ ఇట్లుచని సమస్తదేశంబులఁదిరుగుచు నకలనగరంబులందు స్వేచ్ఛావిహారులయి శృంగారవిలాసంబులు నేత్రపర్వంబులుగాఁ గనుంగొనుచుఁ గొన్నిదినంబుల కొక్కపర్వతంబున మార్గవిశ్రాంతులయియుండి పౌరజనంబులవలనవిని వారలున్నస్థానంబునకుంజని యాపరిచారకులా స్వర్ణకారకులఁజూచి మనమువచ్చినపని సఫలంబాయెనని వివరించిరి॥

ఉ॥ జంగమమూర్తులార! మని♦ సంతిన ముందివిమందు మీరలు
ప్పొంగుచుసర్వభూవరుల ♦ పొంతివిచిత్రముగాఁగబొమ్మలా

రంగుగ నాడుచుండురని ♦ రంజిలఁగావిని కర్పకుండుదా
సంగతి నున్నమంత్రివరు ♦ సమ్మతిఁజూచెదమంచు వేడుకన్॥

ఉ॥ మిమ్ములఁ దోడితెండనుచు ♦ మిక్కిలిసత్వరఁగర్పకుండుదా
మమ్ములఁబంచెమీకుబహు♦మానములీయఁదలంచినాడు వే
రమ్మన స్వర్ణకారకులు ♦ రాజపరేణ్యుని తోడఁ దెల్పుచు
న్నెమ్మదిఁగోర్కెఁదీరఁగఫ♦ణీంద్రపురంబున కేగుదెంచుచున్

వ॥ తమలోఁ దామాత్మగతంబునఁ గర్పకునిశిరచ్ఛేదనంబొనర్ప నేటికి సమయంబు దొరికెనని రథకారకులు పరితోషితాంతఃకరణులై ఫణీంద్రనగర ప్రాకారంబుత్తరించి పురమధ్యదేశంబునఁ గర్పకుండున్న మాణిక్యఖచిత విరాజితంబయిన గృహంబుఁజొచ్చిపరిచారకులు వారితోఁ దమరాక నెఱింగించిన వారలు శుద్ధాంతరంబునకుంజని కర్పకునితో విన్నవించిన,

కం॥ తెలియ విని కర్పకాఖ్యుఁడు
బలువగు సంతోషమెనయఁ ♦ బటువేగమున
న్లలితసభఁజేరి వారలఁ
దెలియుటకై మధురవచన ♦ దీపితముఖుఁడై॥

కం॥ కులమేమి దేశమెక్కడ
నిల జీవనమెట్లు మీకు ♦ నెఱిఁగింపుఁడన
న్జలదర గంభీర ధ్వను
లలరన్నిమూతహాయము ♦ హాన్వయాలెలమిన్

సీ॥ ఘనత శ్రీగిరి మల్లి ♦ కార్జునునిరతంబుఁ
బూజించు జంగమ ♦ మూర్తికులము
శ్రీనగ ప్రాగ్దేశ ♦ మానట్టి త్రిపురాంత
కంబు మాకెప్పుడుఁ ♦ గాపురంబు
సర్వభూవరుల సం ♦ స్థానంబు లందాడు
నీవిద్యలేమాకు ♦ జీవనంబు
సరస సజ్జనసంఘ ♦ సాంగత్యమేమాకుఁ
గోరికఁ దవిలిన ♦ గానముసుండి

తే॥ యనుచుఁ దెల్పినఁ గర్పకుం ♦ డతిముదమున
నాడనప్పుడె సెలవీయ ♦ హర్షమొంది
రుక్మకారులు బొమ్మల ♦ రూఢిఁదనర
వాసిమీర నలంకృతు ♦ ల్సేసి రెలమి॥

వ॥ తదనంతరంబున॥

సీ॥ కర్పకుండొప్పుల ♦ కలిమిచేఁ గులుకుచు
సింహాసనమున నా ♦ సీనుఁడయ్యె
నతనిచెంతను మంత్రి ♦ యమరుండు గుటకలు
మింగుచుఁ గూర్చుండి ♦ పొంగుచుండె
నతనిచెంతను రాజ ♦ హితబంధు జనులుండి
రల వినోదముచిత్త ♦ మలరఁజూడ
వారిసన్నిధియందుఁ ♦ బౌరజనంబులు
సమ్మదస్వాంతులై ♦ సరవినుండి

తే॥ రఖిల దానచయంబుక ♦ స్తాస్త్రహస్త
కమలములఁ మీరఘున పరా ♦ క్రమము తోడఁ

క్రమముగాఁ బరివేష్టించి ♦ కదుముదమునఁ
జెలఁగ రథశౌర్యవరులతి ♦ శీఘ్రముగను॥

వ॥ శ్రీరామవిగ్రహ గర్భంబునఁ జోళభూపతినిఁ బ్రవేశింపం జేసి యాతనితో నీవిధంబొనర్పుండని తెలియంజెప్పి తమరు కొందరు విగ్రహ జఠరప్రదేశంబులం జొరం గొందరు వారు సంగీత సాహిత్య విద్యా ప్రాగల్భ్యంబుఁ జేయుచు రణోప బలంబుగాఁ ధగద్ధకిటశబ్దంబులు వలుకు మృదంగములును గాంస్యతాళంబులునుసభామనోహరంబై వెలయ మ్రోయించి చిత్రవిచిత్రంబులగు ననేకవిధంబులుగా శృంగార విగ్రహం బుల నాడించిన యెడ॥

కం॥ ఒకవైపున రామబలం
బొక చెంతను రావణాసు ♦ రోగ్రబలంబుం
బ్రకటకరంబులఖడ్గ
పరికరంబులువట్టినిలిచెఁ ♦ బజ్జిగఁబరితిమల్॥

కం॥ దశరథసుతు కపిబలములు
దశకంఠుబలంబులడరఁ ♦ దార్కొని వేవే
నిసితసిత మార్గణంబుల
బిసబిస వేయంగఁదొడఁగెఁ ♦ బిమ్మటదైత్యుల్॥

తే॥ బాణముల్నాటిమూర్ఛచేఁ ♦ బడినఁగుంభ
కర్ణుఁడయ్యిందరజిత్తును ♦ గనలి కపి బ
లంబుమీఁదికిదుమికిన ♦ జాంబవంతుఁ
డంగదుండునుసుగ్రీవుఁ ♦ డాగ్రహించి॥

ఉ॥ కన్నులనిప్పులొల్కఁ ఘట♦కర్ణమహేంద్రజయాఖ్యఁ జూచి ఘా
టిన్నిసితోగ్రబాణములు ♦ డెందముతల్లడిలంగ నేయఁ న
త్యున్నతకుంభకర్ణుఁడుమ♦హోగ్రమునందనయంఘ్రినఁద్ధతిం
దన్నిననంగదుఁడువడె ♦ ధారుణిమూర్ఛితుఁడై మహాధ్వనిన్॥

వ॥ ఇట్లంగదుఁడు మూర్ఛితుండై తెలిసి శ్రీరామునన్నిధికిఁ జను
దెంచిన శ్రీరాములు నిజభుజవిక్రమంబునఁ గుంభకర్ణుంబడఁ
ద్రోసిన రావణాసురుండాగ్రహంబున నెదిర్చి రామమూర్తి
మీద నిసితాస్త్రంబుఁ బ్రయోగించిన మరల బ్రహ్మాస్త్రప్రయో
గంబుఁ జేసి సమస్తజనులకు నానందంబు సంపాదింప రామ
విగ్రహాగర్భంబు నందుండి చోళభూపతి ఖడ్గంబుఁ ద్రిప్పుచుఁ
గర్వకుండున్న సింహాసనంబుఁ దరికింబోయి యుపరిభాగం
బుననున్న కర్వకునిశిరచ్ఛేదనంబుఁ గావించి తానానవరత్న
ఖచిత సింహాసనంబునందాసీనుండై యున్న సమయంబున॥

సీ॥ పౌరజనంబులు ♦ పరిచారవర్గంబు
బంధువుల్మిత్రులు వి♦భ్రాంతినొంది
యిటులుండఁగావల ♦ దితఁడొనర్చినపను
లెట్లువితర్కింప ♦ నేరికైన
శక్యంబుగాదిటే ♦ స్వర్ణకారులుదమ
కులమంతఁద్రుంచినఁ ♦ గలతనొంది
మారువేసములచే ♦ మహినెన్నఁడును లేని
వింతయొక్కటిచేసి ♦ వంతగించి

తే॥ కర్వకునిద్రుంచివైచిరి♦గానియింక
నమరునొగిఁ ద్రుంచివైచిన ♦ నఖిలజనులు

సమ్మదంబుననుందురు ♦ సరవిననుచుఁ
బార్థివునిజూచివల్కిరి ♦ పౌరజనులు॥

మ॥ జననాథో త్తమకర్షకుండమరు వా ♦ క్చాతుర్యముల్వీనుల
న్వినిధారాధరవాహవంశజుల న ♦ ర్వించుచ్ఛించె నావంశనా
శనమౌటల్గలశయుగ్మ వత్సరమహా ♦ క్షామంబుఁగల్పించెమీ
రనవద్యస్థితినున్న భూజనులకున్ ♦ హర్షంబుఁబుట్టింపదే॥

వ॥ అనివిన్నవించి పౌరజనంబులు పునఃపునఃప్రణామంబులు గావించిన సమయంబునఁజోళభూపతి సంతోషహృదయారవిందుండై రథకారకులనిరీక్షించి యిట్లనియె॥

కం॥ మెచ్చితి మీమదికిష్టము
వచ్చినగతి వేడుడన్ని ♦ వారకనిపుడే
నిచ్చెదనన రథకారకు
లచ్చెరువుగఁ బలికిరంద ♦ రవనీశునితో॥

తే॥ అవనినాయక మాకిపు ♦ డమరుఁబట్టి
యిచ్చిననుజాలుననిన ను ♦ ర్వీశ్వరుండు
నచివుఁబాశంబుననుగట్టి ♦ స్వర్ణకార
కులకు నిచ్చెనుమానవ ♦ కోటిచూడ॥

వ॥ ఇట్లానంగి భవదీయాభిప్రాయంబెట్లున్న నట్లానరింపుఁడన పౌరుషేయు లతిసంభ్రమంబున నమరుందోడ్కొని పట్టణ శృంగాటక స్థలంబునకుఁ జనుదెంచి స్తంభంబొక్కండక్కడ నాటంజేసి యమరున్దానియందుఁ బాశబంధనం బొనర్చి వీఁడు చేసిన దుర్మార్గంబులకుఁ దగినట్లు బాధింపవలె నని పౌరజనులం దరుం గోపాటోపంబునంబల్క రథకారకులు

వాడిగల కంటకంబులు దెచ్చి మూవారల నందరి నీచందం బున నే నంహారంబొనర్చినాడవుగదా యని కంటకంబులం ఫలలంబుగ్రుచ్చి ధ్వాంతసముదాయంబునకు వేయుచు ఖడ్గంబులం గండలుఖండించి గృధ్రంబులు పరితృప్తినొందం జంచుపుటంబుల కందింపుచుం గొన్ని దినంబులకు నమరుని కళేబరంబంతయు రోసంబున మాయంజేసి శిల్పకారకులం దరుం దమమనోరథఫలం బీడేరె నిఁకమన కులంబెందుం బోడంగానకుండం బునరుద్ధారకంబుఁగావింప వలయునని శుద్ధోదకస్నానంబులు గావించి భసితోద్ధూళిత విగ్రహులై యార్ద్రవస్త్రంబులతోం గాళికాదేవి దివ్యాలయంబుం జేరి ధ్వజస్తంభంబు చెంతం బద్మాసనాసీనులై పదునల్గురుం గాళికాంబం బ్రార్థించినం బ్రత్యక్షంబైనిలిచి యపుడు,

క॥ రథకారులార మీరీ
విధమునను గూర్చి వేద ♦ విధిం బ్రార్థింపం
గథయేమి చెప్పినంత నే
యధికార్తిని మీదుకోర్కె ♦ లవియొనం గూర్తుక॥

క॥ అనిపలికిన రథకారులు
వినినెమ్మది వేడ్కంబూని ♦ వినమితులై వా
రనిరిలం గర్వకుం డమరుఁడు
మనకులజులనెల్లం బట్టి ♦ మ్రందించె నోగిక॥

తే॥ కాననిప్పుడు నీకటా ♦ క్షాంచలమున
దేరిపారంగ మముంజూచి ♦ తిరిగిమఱియు

వేశలోద్ధారకంబుగా ♦ వించిమించి
కరుణఁ బ్రోవఁ గదమ్మ యో ♦ కాళికాంబ॥

వ॥ అనిన నావిశ్వబ్రాహ్మణులతో నక్కాళికాదేవి యిట్లనియె॥

ఉ॥ మంచిదమీరు నెమ్మదిని ♦ మానక చింతపడంగనేలనో
వంచనఁజేసెఁ గర్భకుఁడు ♦ పాపమటంచుఁదలంపక న్నిపం
బెంచుచుఁ గోశకారుఁడటు ♦ పెట్టినతంత్రముఁబూని త్రుంచిన
న్వంచనచేతఁ జచ్చెమతి ♦ పారెసువర్ణము కొంతనిల్చనన్॥

తే॥ స్వర్ణకారకులారమీ ♦ వర్ణమొక్క
కొంతయితరగృహంబులఁ ♦ జింతచేత
నున్నదేకాని మొదలుచె ♦ కుండఁబోవ
లేదుగావున నేనొక్క ♦ లీలఁబూని

మ॥ నరరూపంబున వీరపాపముయున ♦ న్నామంబు నేఁదాల్చి శం
కరపాదార్చన భక్తినైపుణతచేఁ ♦ గల్యాణవారాసినై
వరగంగానది గర్భమందుదయినై ♦ వాటిల్లనే తెంచియి
ప్పరసద్మంబుల నున్నవర్ణముపడిం ♦ బాత్రంబుగాఁ జేయుదున్॥

వ॥ అని రథకారకుల కభయంబిచ్చి కాళికాదేవియంతర్హితయై

సీ॥ సారంగగాఢాంధ ♦ కారంబు లేసాటి
కాంతముంగురుల శృం ♦ గారములకు
రాజీవరాజీవ ♦ రంజితంబేసాటి
కలికినేత్రముల ♦ శృంగారములకు
దంభోళిధరకుంభి ♦ కుంభంబు లేసాటి
కాంతపాలిండ్ల శృం ♦ గారములకు

మృగనాథునవలగ్న ♦ గగనంబులేసాటి
కలికినెన్నఁడుము శృం ♦ గారములకు॥

తే॥ అనుచు సకలజనవ్రాత ♦ మభినుతింపఁ
గాళికాదేవికాశిగం ♦ గాప్రవాహ
మందుజనియించితాను బ్ర ♦ త్యక్షమయ్యె
స్వర్ణకారుల చెంతకుఁ ♦ బూర్ణకృపను॥

వ॥ ఇట్లువచ్చియేను వీరపాపమను మహాశివ భక్తురాలనన్నం తనె స్వర్ణకారకులతి ముదంబున నాతోంటినాఁడు ప్రత్యక్షంబై కాళికాదేవి యవ్విధంబున వచ్చెనని పలికిన వాక్యంబులు స్మరించి యయ్యవసరంబున వారలందఱు నర్ఘ్యపాద్యాది విధులొనరించి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యంజలీ బద్ధులై యిట్లనిరి॥

తే॥ మమునందఱి వీరపా ♦ పమ్మయిపుడు
సత్కృతార్థులఁ జేసిమా ♦ జాతిమొక్క
డెక్కడున్నదో తెలిసి వ ♦ ర్తిమతులఁ
జేయఁగదవమ్మ సత్ఫల ♦ సిద్ధిగాఁగ॥

వ॥ అనియిట్లు విన్నవించిన వీరపాపమ్మ స్వర్ణకారకులను దోడ్కొని సమస్త దేశంబులం బరగృహంబులనున్న వారల నందఱిఁ వెడలించి విధ్యుక్తంబులుగాఁ బ్రాయశ్చిత్తంబులను లింగధారణ యజ్ఞోపవీత ధారణంబుల నొనర్చి పునరుద్ధారకంబుఁ గావించె॥

తే॥ కనకదుర్గాంబ వివరించెఁ ♦ గానఁదెలిసె
నీసవిస్తార కథమెన్నఁ ♦ రెరుఁగరన్న
రాజ ధీరజనమనోవి ♦ రాజితంబు
నగుచు నీకనిది భూస్థలి ♦ నలరునిట్లు॥

వ॥ అనియివ్విధంబున మాదన్న నిజాగ్రజునకు విన్నవించియుంత వారిరువురును నిరతాన్నదానపరులును శివభక్తాగ్రగణ్యులును దిగంతకీర్తి విశ్రాంతులును నాశ్రితసంతోషాపాదితహృదయాంభోరుహులునై యుండిరి॥

క॥ హరిహరి పావకలోచన
హరిరాజా భరణశర్వ ♦ హరవిశ్వేశా
హరివినుత మృత్యుంజయ
హరిశరహరి వీరమల్లి ♦ కార్జునలింగా॥

గద్య ♦ ఇదిశ్రీమదుమామహేశ్వరచరణారవింద సేవాప్రవీణ తెనాలివంశపవిత్ర కస్యపగోత్రార్యజనస్తోత్ర పాత్రమృత్యుంజయ నామధేయ పౌత్రమల్లికార్జున తనూభవ
రామలింగ నామధేయ కవివిరచి
తంబగు రాజధీరజనమనోవి
రాజితంబను గ్రంథంబు
నందుసర్వంబుఁ
కాశ్వాసము,
సంపూర్ణము.

శ్రీవిరాడ్విశ్వకర్మార్పణమస్తు.

# శ్రీ విశ్వకర్మశతకము.



శా॥ శ్రీమద్భక్త జనాబ్జహేళి కరుణా ♦ సింధో సుపర్వావనో
ద్దామా! యోగిమనోబ్జవాస! బుధసం♦తానేక హాకార శ్రీ
ధామాఖండలముఖ్య దేవమకుటో ♦ ద్యద్రత్నభూరిప్రభా
స్తోమవ్యాప్తపదారవింద! భువన ♦ స్త్రాయాత్మసర్వేశ! సు
క్షేమానుగ్రహదృష్టి నాకొసగు మో♦ శ్రీవిశ్వకర్మప్రభో. 1

శా॥ శ్రీమద్విశ్వగురున్పరాత్పరు సుర ♦ శ్రేష్ఠున్ సులోకావనో
ద్దామానుగ్రహశీలు సృష్టి విభవ ♦ త్రాణున్మదింమిమ్ము నే
నామోదంబున గొల్తు బ్రోవుమిక మో♦క్షాయత్తసంసిద్ధిగా
క్షేమబ్రహ్మము గమ్యమూర్తిపరయన్♦ శ్రీవిశ్వకర్మప్రభో. 2

శా॥ శ్రీమద్విశ్వగురుండు దేవనికర ♦ శ్రేష్ఠుండు లోకావనో
ద్దామానుగ్రహశీలు విశ్వవిభవ ♦ త్రాణుండు దారుండు సు
త్రామాంభోరుహగర్భపూజితలస ♦ త్పాదారవిందుండు సు
క్షేమబ్రహ్మము! మమ్ము బ్రోవుమిలలో ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 3

మ॥ బుధులన్ సన్నుతిఁ జేసి దంతివదనున్ ♦ బూజించి వాణీరమా
కుధరేంద్రాత్మజులన్ భజించి ద్రుహిణుం♦ గోరాజవాహున్నృపా
సినులన్వేడి త్వదీయ వర్ణనవిధు♦ల్నిర్మింతు మోక్షేచ్ఛచేఁ
బృథు భక్తావనలోకసృష్టి విభవ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 4

శా॥ చైతన్యాత్మకపూర్ణమై యచలమై ♦ సత్యంబునై లోకవి
ఖ్యాతంబై నిగమాంతమైకథితమై ♦ కారుణ్యసంయుక్తమై
ప్రీతిన్ సర్వచరాచరాత్మకుఁడవై ♦ వెల్గొందునీవెన్న మ
చ్చేతోధీశ్వర! దేవదేవవిభవ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 5

శా॥ సూరివ్రాతచకోరసోమ! భువన ♦ స్తోమావనోద్దామ స
చ్చారిత్రుండవు దేవదేవుఁడవు! భా ♦ స్వద్విగ్రహమ్మీవిశోభా
కారంబై భువిఁ దేజరిల్లఁగను మూ ♦ ఢవ్రాతమాయాగుణావి
స్తారంబాత్మ నెఱుంగలేక బహులిం ♦ దద్దేతురజ్ఞానులై
స్మేరాస్యాంబుజ! భక్తరక్షణగుణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 6

శా॥ ద్రుహిణాండావళిఁ బెంపఁద్రుంపనడఁపన్ ♦ దేవుండవై సర్వదా
బహిరంతస్స్థితబిందునాదసుకళా ♦ బ్రహ్మాభిధానుండ నీ
వహిరాట్తల్పముఖామరార్చితకృపా ♦ యాదఃపతే ప్రోవుము
త్సహితానుగ్రహవీక్షణావళులభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 7

మ॥ జలజాతాసనవాసవాద్యమరుల ♦ శ్రాంతంబుత్వన్మూర్తిని
శ్చలతన్ గాంచగ నోపజాలరట భా ♦ స్వత్పుష్కరాకారిపి
విలలోనీకెనమైన వేల్పుగలఁడా ♦ యింపారమోక్షాంగనో
జ్జ్వలభోగంబొనగూర్చి ప్రోవుమిక రా ♦ జద్విశ్వకర్మప్రభో. 8

మ॥ శ్రుతిచాతుష్టయవందితాత్మ! విబుధ ♦ స్తోమాత్మసంచారనీ
వతిచాతుర్యసమగ్రధైర్యసుగుణ ♦ వ్యాపారలోలుండ వీ
స్థితిసృష్ట్యాదిగుణప్రతిష్ఠుఁడవునం ♦ దేహమ్ము లేదయ్య యా
శ్రితరక్షాకర! దేవదేవ! సుగుణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 9

శా॥ శ్రీమన్మంత్రలయాదియోగములు సూ♦త్రివ్రాతము ల్వేదసం
స్తోమంబుల్వరశాస్త్రసంచయము ల♦ స్తోకప్రబంధావళుల్
ప్రేమన్ బ్రాప్తిముఖాష్టధాతులును ధా♦త్రీముఖ్యభూతవ్రజం
బామోదస్థితి నీదుకల్పితము వే♦రై యెన్నఁగా లేదు సు
క్షేమానందనిరావలంబ లలిత ♦ శ్రీ విశ్వకర్మప్రభో. 10

మ॥ భువనానీకముఁ బెంపద్యుఁ పగను సం♦పూర్ణైకచాతుర్యతన్
శివవైకుంఠవిరించిసౌఖ్యవిధులన్ ♦ సృష్టించి రక్షింతువీ
భువనవ్రాతము నీదుకుక్షి నడఁగున్ ♦ భూతేశభూతావన
ప్రవరాగమ్యగుణైకగణ్యుఁడవు దే♦వా! విశ్వకర్మప్రభో. 11

శా॥ ప్రాలేయాచల హారహీర విజిత ♦ ప్రాబల్యదివ్యప్రభా
జాలానంత రవిప్రకాశనిజభా ♦ స్వద్గాత్ర కారుణ్యసం
శీలాచింత్య గుణాపవర్గ వనితా ♦ శ్రీలోల రక్షించుమం
శ్రీలెల్లప్పుడొసంగి శత్రుహరణా ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 12

శా॥ యోగీంద్రామరసేవితాంఘ్రియుగ దే♦వోత్తంస జోహారు స
ద్భోగేంద్రార్చితపాదపంకజ! కృపా♦ప్రాగణ్యోదార మో
రాగద్వేష విహీనభూత హృదయా ♦ ప్రావీణ్యతాగార శ్రీ
వాగీశాద్యమరేంద్రవందిత విభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 13

శా॥ సద్యోజాతముఖైకపంచముఖభా♦స్వద్బ్రహ్మరాశిన్ గృపా
సద్యద్వేత్తృగణంబుగాను ప్రముఖపం♦చబ్రహ్మలన్ బుట్టగా
నుద్యచ్ఛక్తి నొనర్చి తన్మహిమ నే♦ సద్యోగము ల్వేరుగా
విద్యారంభ మొసంగి లోకములు సం♦ప్రీతానుకంపంబుచే
హృద్యంబొప్పఁగ బ్రోచినట్టిసుగుణా♦ శ్రీవిశ్వకర్మప్రభో. 14

శా॥ లోకేశా దేవుడవాదికర్తవు కృపా ♦ లోలుండవాద్యుండ వీ
వాలోకింపఁగ నిన్నుఁగొల్వఁగను మో ♦ క్షైశ్వర్యముల్ గల్గునా
సాలోక్యాది చతుర్విధప్రభల భా ♦ స్వన్ముక్తిదానప్రదా
శ్రీలావణ్యవపుః ప్రకాశసుగుణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 15

శా॥ జేజేలందరు డెందముల్గలిపియో ♦ జింపంగ నీరూపున
వ్యాజప్రోద్ధినిగానఁ బించునట సూ ♦ త్ర్యాకార తేజంబుగా
రాజద్భక్తమనోనికేతనకృపన్ ♦ రక్షించు మర్వీన సదా
సౌజన్యాకర! దేవదేవ! గుణ భా ♦ సద్విశ్వకర్మప్రభో. 16

మ॥ వరసాహస్రిముఖుండవై నపురుష ♦ ప్రావీణ్యరూపుండ! సు
స్థికతన్మాత్రమున శూలినిన్భుజములన్ ♦ శ్రీనాథు నీయూరులన్
బరమేష్ఠిన్హృదయుగ్మమందు ముఖవు ♦ న్నాటించి పుట్టించితో
పరమేశావ్యయ లోకనాథ! హర! దేవా! విశ్వకర్మప్రభో.

మ॥ లలితాత్మన్సరసీరుహాహితుని లీ ♦ లన్నన్నులన్ సూర్యును
జ్వలతం బొడ్డున గంధవాహు నిశిర ♦ స్థానంబునం దంబరం
బలఘుప్రజ్ఞఁ బదంబులందనని క ♦ ర్ణావిర్భవంబాశలున్
జెలగన్పుట్టఁగఁ జేసి నట్టివిభవ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 18

శా॥ గౌరీజాని ధరాసురోత్తముఁడు కం ♦ జాతాత్ముఁడున్ రాజుఁగా
నీరేజాసనుఁ డూరుజాఖ్యుఁడసఁగా ♦ నేర్పొప్పఁగా నంఘ్రిజా
కారుండింద్రుఁ డనంగఁ జేసితివిరా ♦ కాబ్జాబ్జవారాభసం
స్మేరాస్యాంబుజ! దీనరక్షణగుణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 19

శా॥ సద్యోజాతముఖాబ్జమందు శివ భా ♦ స్వత్సైదతత్త్వంబున
దివ్యాఖండలవామదేవ సుముఖా ♦ విర్భావసాదాఖ్యయున్

ప్రోద్యత్తత్పురుషాననస్థలమునన్ ♦ మూర్థోర్ధ్వరుసాదాఖ్యనీ
హృద్యత్తత్త్వములుద్భవించెగదను ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 20

మ॥ లలితా ఘోరముఖాంబుజాతమున లీ ♦ లన్గర్తుసాదాఖ్యయుక్
జ్వలతేశాన్యముఖారవిందమునభా ♦ స్వత్కర్తసాదాఖ్యయుక్
గల్గుగన్ జేసితివశ్శివతత్త్వముల వే ♦ గన్ పావకానన్యాంబులన్
ఖానసంహారబుధావన ప్రబల రం ♦ గద్విశ్వకర్మప్రభో. 21

మ॥ పరపంచాత్మరితావకప్రబల ది ♦ వ్యాంగోదయంబెన్నగా
నరయన్ నీతనయుండు త్వష్ట భవదీ ♦ యాభుండు సాదృశ్యమిం
పరయన్ రెండవ వేదమును గలదీ ♦ యర్థంబు సిద్ధంబుగా
సరసప్రౌఢిమగాంచువారలకుభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 22

క॥ వేదాంగంబులునీముఖాంబుజమున ♦ న్వీన్యక్తమైవృత్తిత
ద్వేదాంగంబులునా మనుప్రభృతులున్ ♦ విప్రుల్ తదాభ్యాసకుల్
నాదాతీతము వాదరూపకము లె ♦ న్నన్నీవె సర్వాత్మను
శ్రీదాలోకగణైక సృష్టివిభవ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 23

మ॥ ఇరువైయేను సుతత్త్వముల్ లలిత ల ♦ క్ష్మీశాదివాగీశ్వర
స్ఫురదంభోరుహ సంభవాద్యమరుల ♦ స్తోకస్థితిన్తావకో
త్కరుబలంచున్పురుషైకసూక్తమున వే ♦ దంబును సిద్ధాంతమై
బరగెన్ సర్వచరాచరాత్ముడవు టే ♦ వా! విశ్వకర్మప్రభో. 24

శా॥ లోకానీకములెల్ల కందుకములై ♦ లోకేశముఖ్యామరు
ల్లీకున్ భృత్యగణంబులై శ్రుతులు సా ♦ న్నిధ్యంబులై గొల్వన
స్తోకక్రీడవహించు బ్రహ్మము నహో ♦ స్వాతంత్ర్యవిద్వెన్నఁగా
శామూప్యాదవనాల్పాకృతివి గం ♦ గద్విశ్వకర్మప్రభో. 25

శా॥ నానాస్థావరజంగమప్రకరముల్ ♦ నారాయణాద్యామరుల్
జ్ఞానానందవైన నితసపురా ♦ గాఢంబుగాఁ బుట్టఁగా
ధ్యానింపం బ్రణుతింపనర్హానుగుబ్ర ♦ హ్మంబీవె లోకంబునన్
సేనాని ప్రముఖార్చితైకవిభవ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 26

మ॥ సురులందైత్యుల యక్షకిన్నరహరి ♦ స్తోమంబుమర్త్యాళినిన్
ధరణీభృత్తతి కాననావళులన ♦ ద్యానీకముల్ కాస్యపీ
వరకీల్యంబుసమస్త పుష్కరసుహా ♦ ప్రావీణ్యభూతాళివి
స్తరసంవృద్ధినొనర్చి సంహరసుభా ♦ స్వతీర్త్తిఁగావించుసు
స్థిరతేజోమయ! నిర్వికార! సుగుణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో 27

మ॥ భవదాధీనముగాని వస్తుతతులే ♦ బ్రహ్మాండమందెన్నఁగా
నవిశేషంబిక లేదు లేదువిభవ ♦ స్వాతంత్ర్య శీలుండవై
నవలీలం సకలంబొనర్తువుకృపా ♦ యాదఃపతే పాహిమా
భవరోగైకభిషగ్వరుండవిలభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 28

మ॥ భవదీయాత్మజుఁడైనయామసువుదా ♦ ప్రాగ్భాగమందుండిసం
భవమొందించె చతుర్దశైకమనుస ♦ ద్వారంబు లోకావన
ప్రవరుల్వారలు సర్వలోకముల నం ♦ భావించి పాలించిరు
త్సవమొప్పన్ జగనాదిదేవగుణభా ♦ సద్విశ్వకర్మప్రభో. 29

మ॥ స్ఫురితుండైన మయుండు కస్యపుఁడా ◆ బుట్టించితద్వీర్యమం
దురు దేవాసురనైనతేయ భుజగ ◆ వ్యోమగాటనానేకదు
స్తరజంతువ్రజముద్భవింపఁగను భా ◆ స్వచ్ఛక్తిఁ గాఁపించె సు
స్థిరుఁడాధీరుఁడు దారుఁడార్యమణిసు ◆ శ్రీవిశ్వకర్మప్రభో. 30

మ॥ పరగన్ రాజసనన్మయుండయుడు భా ◆ స్వచ్ఛక్తిఁ బుట్టించియూ
వరశక్త్యాత్మసురాదిఁ జేసితానెఁగా ◆ భవ్యాత్మునిం జేసినా
డరయన్ శక్తియుతుండు నీసుతుఁడు భా ◆ స్వత్కీర్తికాంతాహిత
స్థిరుఁడార్యాగ్రణి దేవవందితుఁడు సు ◆ శ్రీవిశ్వకర్మప్రభో. 31

మ॥ అరయన్ త్వష్ట్రమయుండు విశ్వము దను ◆ ద్యచ్ఛక్తిఁ బుట్టించియూ
సరసున్ నిర్జరశిల్పిత్వమునకు ◆ న్స్థాపించి కీర్తిప్రభా
కరుఁ జేసించె తదీయమైన మహిమా ◆ గాధం బగమ్యంబు దు
స్తరతేజోనిధి భక్తరక్షణకృభా ◆ స్వద్విశ్వకర్మప్రభో. 32

మ॥ నిజపుత్రీమణి న దశాస్యునకొసంగెన్ ◆ ధీరుండు త్రైపట్టణా
స్వజనంబేపుగఁ జేసి వానికెనఁగాఁ ◆ జింతింప నేరన్యులున్
రజనీనాథ యశోవిలాసుఁడు సుర ◆ శ్రేష్ఠుండు చర్చింపఁగా
వృజినారణ్యకుఠారుఁడా మయుఁడు సు ◆ శ్రీవిశ్వకర్మప్రభో. 33

మ॥ భవదీయాత్మజుఁడౌ మయుండు విభవ ◆ ప్రావీణ్యశక్త్యాత్ముఁడై
భువి తేజోనిధి సర్వవిద్యలకు సం ◆ పూర్ణుండు ధర్మావనీ

ధవుకాసంనదనిచ్చె తన్మహిమలుం ♦ దర్శింపగా శక్యమా
స్థిరభద్రాత్ముఁడుదార వర్తనుఁడుసు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 34

మ॥ అరయ న్త్వష్టమహోత్తమాంశమున ♦ బ్రహ్మల్ బుట్టి రుద్యన్మహో
త్కరసంఖ్యన్బదకొండు రూపములచే ♦ తగ బుట్టిరారుద్రులున్
శిరముల్ మూఁడునుగల్గి తేజరిలుచున్ ♦ శ్రీవిశ్వరూపుండుదా
సరవిన్ బుట్టినవానికిన్ త్రిదశభా ♦ స్వద్దివ్యపౌరోహిత
స్థితునింజేసెమహోగ్రగణ్యుఁడరయన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 35

మ॥ స్వరశాస్త్రంబులుపంచపక్షియనుభా ♦ స్వత్పత్తితిథ్యాదులున్
వరవారంబులు భాస్కరాదిగ్రహముల్ ♦ వర్ణింపతన్మండలో
త్కరముల్ వాహములాదిసృష్టివరుసన్ ♦ గావించెనీపుత్త్రుఁడౌ
కరుణావారిధి త్వష్టనామహరిరం ♦ గద్విశ్వకర్మప్రభో. 36

మ॥ లలితోత్కృష్టుఁడుత్వష్టనామహరిలీ ♦ లాకారుఁడిలోకముల్
కలితానుగ్రహదృష్టినేర్పరచివే ♦ గన్ధారుణిన్ధరారత్నకై
కులశైలంబులు శేషునిన్బరివరున్ ♦ గూర్మాఖ్యునిన్జేసి భూ
సరసీజాక్షికి సంతసంబొసఁగెభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 37

మ॥ శిలిపిబ్రహ్మనిజాంశ మష్టవసువుల్ ♦ చిత్రంబుగాఁబుట్టిరా
శిలిపిబ్రహ్మ విశేషసన్మహిమలున్ ♦ జర్చింప శక్యంబెస
ల్లలితానుగ్రహ శాలి నీసుతుఁడులీ ♦ లాకారరాకావనో
జ్జ్వలచారిత్ర పవిత్రభూరిగుణభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 38

శా॥ రామోర్వీపతి సేతుబంధనమునన్ ♦ బ్రాశస్త్యశైలాటన
స్తోమంబెన్న నసంఖ్యలుండగమహా ♦ సూత్రజ్ఞుఁడౌతావకో

ద్దామాంశోద్భవ నీలుచేవనధిబం • ధంబయ్యె చిత్రంబునీ
సామర్థ్యసిద్ధి లోకదేశికవిభా • స్వద్విశ్వకర్మప్రభో. 39

శా॥ దైవజ్ఞాఖ్యుడుదారతేజుడు గుణా • ధ్యక్షుండు నిర్మించెస
ద్భావంబొప్పగ ద్వాదశార్కులజగ • ద్రక్షార్థమున్సత్కృపా
ప్రావీణ్యాంబుధి వానిచర్యలుగణిం • పన్ శక్యమా యోరికిన్
భావింపంగ మహాత్ముడార్యమశిభా • స్వద్విశ్వకర్మప్రభో. 40

శా॥ కాలాంభోధరవాహుడామనువురం • గత్వష్టకానీలమా
లీలాంభోదమునామయాఖ్యునకుహా • లిన్ ద్రోణమేఘంబును
శ్రీలన్శిల్పికి కుంభమేఘమును నా • రిశ్రేష్ఠదైవజ్ఞునన్
గేళిన్ వాయుఘనంబు వాహనములై • కీర్తింపగా స్వేచ్ఛచే
నేలోకంబును సంచరించిసురదై • త్యేంద్రాళికిన్ గోరికల్
వాలాయంబునొసంగి బ్రోతురగి దే • వా! విశ్వకర్మప్రభో. 41

మ॥ మనువేకాక్షరమంత్రమున్ మయుడు ప్రే • మన్ వేచతుర్వర్ణస
ద్ఘనమంత్రంబును పంచవర్ణములచే • తన్ వెల్గుమంత్రంబుస
ద్గుణుడౌత్వష్టయుశిల్పిసాధకునికే • క్షోణిన్ వెసన్ షట్కసం
ఖ్యనువర్ణంబులుగల్గుమంత్రమునుద • క్షాభిఖ్యుడష్టాక్షరిన్
ఘనతన్ జప్యము సర్వగాదగునురం • గద్విశ్వకర్మప్రభో 42

మ॥ మనువన్ బ్రహ్మకు నావరామయునకు • న్నాయాదిశక్తి
న్మతిన్
ఘనమొప్పంగను త్వష్టకిచ్ఛయును స • త్కారుణ్యత
న్శిల్పికిన్

మునుకొన్ జ్ఞాన సుశక్తియున్నిరతమున్ ♦ బొల్పొందు దైవజ్ఞులన్
ఒనరున్నత్రికయుపంచశక్తులిపియా♦నో విశ్వకర్మప్రభో. 43

మ॥ మనుగోత్రంబగుసాన గాహ్వయముచే ♦ క్ష్మాచక్రమం దుద్భవం
బొనరన్ వింశతిమీఁదనైదునగుసం♦ఖ్యోద్వృత్తిగోత్రంబులన్
జననంబై యభివృద్ధినొందె ధరణీ ♦ చక్రంబు రక్షింపఁగా
సనకాద్యర్చిత పాదపంకరుహభా ♦ స్వద్విశ్వకర్మప్రభో 44

మ॥ అరయన్నా నగముఖ్య గోత్రములయం ♦ దారూఢిగా నొక్కటన్
పరఁగన్ వింశతిమీఁదనైదు వరుసన్ ♦ భాసిల్లెగోత్రంబులా
పరణిన్నూటికిఁ బైనవింశతియునెం♦ చన్నైదు గోత్రంబులై
వరవిఖ్యాతివహించెవృద్ధియగుచున్ ♦ వారున్ సదావోజలున్
సరసోదారులు విశ్వభూసురులుభా♦స్వద్విశ్వకర్మప్రభో. 45

మ॥ పరఁగన్ యాజుష వేదమందువరస♦ త్త్వాతంబులునూన్నడగా
వరుసన్నొగ్గెడి వన్నమందునరయన్ ♦ ఓజోసిశబ్దంబువి
స్తరతన్బల్కనుసంధ్యయందమరుభా ♦ స్వద్యోజశబ్దార్థమిం
పరయన్ దేవుడు విశ్వకర్మయనిసి♦ త్త్యానందమైయుండె,నా
కరణున్గానరు మూర్ఖమానవులురం♦గద్విశ్వకర్మప్రభో. 46

మ॥ విరివిన్ వేడ్కమను ప్రజాపతికి నా♦విర్భావముయ్యెన్ ప్రభా
కరగోత్రింబులు పంచవింశతియురం ♦ గత్కీర్తినీరీతిఁగా
వరగోత్రంబులుజాతమై నెగడినీ ♦ వంశోద్భవుల్ ధాత్రిక్షి
బరమార్థంబుగరక్షఁజేతురాగిభా స్వద్విశ్వకర్మప్రభో. 47

మ॥ గురుబుక్కాఖయుసానగా హ్వాయుల స♦ద్గోత్రంబు సూత్రంబుదా
నురువిఖ్యాతిమనాశ్వలాన్వయమున ♦ దోర్జాతసాంగత్యముల్
సరవిన్నల్గుమను ప్రవీణజులు నెం ♦ చన్లో హకారుల్సదా
ధరసస్యాదిసమృద్ధి సాధనముల ♦ త్యాసక్తిఁగావింపగాఁ
గరుణన్వేడ్క-ననుజ్ఞఁజేసితివిరం ♦ గద్విశ్వకర్మప్రభో. 48

మ॥ హరిరూపుండు సనాతనైకవిదిత ♦ వ్యాపారగోత్రుండు సు
స్థిరుఁడున్ యాజుషవేది సర్వసుగుణ♦శ్రీవామదేవాఖ్యుఁడా
నరసుం డైనముఖుండువానివలనన్ ♦ సంభూతమైశ్రీఘ్రమున్
వరనిర్మాణ మొనర్చి చాలపనుల ♦ న్వర్ధిల్లగాఁ జేతురిం
పరయన్ వారలు దారుకారులన దే♦వా!విశ్వకర్మప్రభో.49

శా॥ సామామ్నాయుల ఘోరసత్ప్రవరయుక్ ♦ చాతుర్మ్యఁభాకారము
ద్ధామాభావన గోత్రమున్గలుగు నా ♦ త్వష్టాంశ నంభూతు
లీభూమిన్తామ్రసువర్ణపాత్రిముఖర ♦ ప్రోల్లాసనిర్మాణములున్
బ్రేమన్ నాంస్యకకారులందురిలను♦ శ్రీవిశ్వకర్మప్రభో. ౫౦

మ॥ స్ఫురితాథర్వణవేదిప్రత్నసమహా♦ పుణ్యైకగోత్రుండుత
త్పురుషాఖ్యుండ నశిల్పిజాతఘనులీ♦ భూమిన్ సురాగారముల్
వరుసన్ సృష్టినొనర్చి గ్రామముల భా ♦ స్వచ్ఛక్తి జేజేలుగా
స్థిరతన్జేతురు విశ్వకర్మజులిలన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. ౫౧

మ॥ సరవింభూరిసుపర్ణగోత్రమిలనీ ♦ శానార్యాఖ్యుసాంగత్యముం
స్ఫురితోంకారసుశాఖయుం గలుగుసం♦ పూర్ణుండు దైవజ్ఞడా
వరవంశోద్భవులు ర్వరత్నఖచిత ♦ స్వారస్య చామీకరో
త్కరభూషాదులొనర్తురిమ్మహినిరం ♦ గద్విశ్వకర్మప్రభో. 52

మ॥ వరగం సానగగోత్రజాతులుమను♦ బ్రహ్మన్వయోదారులిం
పరయం గింశుకదండముం రజతది♦ వ్యానందమౌంజందెముల్
తెరగాఁబూని వసంతవేళనుపవీ ♦ తశ్రేణి జేయంఁదగుం
పరికింపన్నలితాష్టవత్సరమునం ♦ బ్రావీణ్యలై వారలీ
ధరనాచార్యులుకీర్తియుక్తులిల నా ♦ ధావిశ్వకర్మప్రభో. 53

మ॥ గురుతేజైకసనాతనాఖ్యవిలస ♦ ద్గోత్రాబ్ధి నావిర్భవుల్
సరవిన్బిప్పల దండమూని వెసభా ♦ స్వత్పద్మసూత్రంబుతో
స్ఫురితైకాదశ వత్సరంబునను సం ♦ తోషోపవీతంబుని
ద్ధరగీర్పిస్మర్తువునందొనర్పదగు చం ♦ ద్రాబ్జాబ్జకీర్తిప్రభా
కరులువ్వారలు దారుకారులనురం♦ గద్విశ్వకర్మప్రభో. 54

మ॥ లలితత్వష్టజులైన కంచరులులీ ♦ లన్వేశగత్కాలమం
దలఘుప్రజ్ఞనుహేమదుగ్ధజనితో ♦ ద్యద్దండముం తామ్రము
జ్జ్వలమౌంజందెములూని ద్వాదశసమ♦ ప్రావీణ్యకాలంబునం
దిలలోఁజేయఁగఁబోలు నాభువస♦ శ్రీగోత్రులీ కర్మముల్
జలజాతాంబక వాసవాదినుతభా♦ స్వద్విశ్వకర్మప్రభో. 55

మ॥ శిలిః బ్రహ్మజులైనకాంస్యబుధులుం శ్రేష్ఠంబుగావృష్టియుం
గలకాలంబు మఱ్ఱిదండము సమూ♦ ఖ్యంగల్గి మౌంజందెముల్
విలసత్తంతువుచేనొనర్చివడుగుల్ ♦ విఖ్యాతిఁజేయుందగుం

లలితప్రత్నసగోత్రజుల్నవసమో ♦ ల్లాసానుకాలంబునన్
బలభిత్పూజితపాదపంకరుహభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 56

శా॥ తారాధీశ్వరుకాలమందుఖదిరో ♦ ద్యద్దండముల్ హేమవి
స్తారోదారములైనజందెములుభా ♦ స్వత్కీర్తిగాదాల్చియా
సారశ్రీకరతత్కులాన్వయసుప ♦ ర్ణాభిఖ్య గోత్రుల్మహా
చారుల్ షోడశవత్సరంబెవడు గాం ♦ బ్ల్యాగశాస్త్రీయమా
నాయూర్ధ్వభువనావనప్రబలచ ♦ ర్యా విశ్వకర్మప్రభో. 57

మ॥ మనువంశోద్భవులైనవారలును హే ♦ మారంభకాలంబునం
ఘనకోణత్రితయంబు నేర్పరచిరం ♦ గత్కుండముల్ద్రవ్యంగా
జనునాభూమిని మంత్రవేద్యులు మహా ♦ సామర్థ్యయుక్తోత్తముల్
సనకాద్యర్చితలోకసృష్టిగుణ భా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 58

మ॥ గుణవంతుల్మయ సత్కులీనులు చతు ♦ ష్కోణంబులున్ద్రష్టజుల్
ఘనతర్వవర్తులరూపముల్ శిలిపిరం ♦ గద్వంత్యలంకారస్థానం
త్ర్యనుకోణంబులు తత్కువంశభవుల ♦ ష్టార్ధకోణంబులున్
దనరంగుండము లేర్పరించదగు దే ♦ వా! విశ్వకర్మప్రభో. 59

మ॥ వరబుగ్వేదమునామనుప్రభవులున్ ♦ బాహ్యంబులున్ సన్నగా
బరమార్థంబు తదీయవంశజులు ని ♦ ష్ఠావుల్ సదాచారులి
ద్ధరరుద్రాక్షవిభూతిసంయుతమహా ♦ ధర్మంబులుంబూనగా
సరవింజెల్లునటంచు బల్కితివిభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 60

మ॥ భువిలోనన్మయవంశజుల్ సుగుణసం♦భూతుల్యజుర్వేదమున్
ధృవబుద్ధింజదువంగధర్మమగు ర♦క్తిం వారుపుణ్యాత్మకుల్
సవిశేషంబుగఁగీర్తిఁ శుభ్రఘృణులీ♦శా! వారిచారిత్రము
ల్వరుసన్జిత్రముదాత్తతేజులిలభా♦స్వద్విశ్వకర్మప్రభో. 61

మ॥ సరవిన్దుష్టకులీను లీశ్వరశిరో♦సామశ్రుతి న్బాఠము
ల్వరుసంజేయఁగబోలు వారలుయశః♦ప్రావీణ్యులార్యుల్సదా
పరమార్థాను భవైక వేత్తలుమహా♦భక్తావనోదారసు
స్థిరచారిత్రజగత్ప్రభుత్వలలిత♦శ్రీవిశ్వకర్మప్రభో. 62

మ॥ లలితాథర్వణవేదపాఠమునులీ♦లన్జేయఁగాఁబోలును
జ్జ్వలశిల్పిప్రభవాత్ములీ ధరణిసా♦ధ్వాత్మీకృత్తికాముల్ సదా
కలుషధ్వంసకులార్యబంధువులువీ♦ఢాయాసులుద్యత్కృపా
కరులార్యావనలోకనిర్వహణకం♦గద్విశ్వకర్మప్రభో.64

మ॥ వరదైవజ్ఞకులప్రభూతులు మహా♦వాంఛన్సదాభక్తిచే
గురుగాయత్రిఁబఠింపఁగావలయునీ♦క్షోణిన్ తదీయాన్వయు
ల్సరసప్రౌఢిమయోగ్యసద్గుణగణ♦స్వాతంత్ర్యచిత్తుల్కృపా
కరసృష్టిప్రభవైక కారణ శుభాం♦గావిశ్వకర్మప్రభో. 64

మ॥ కృతవేళన్మదిలోఁదలంచుటయునుం♦త్రేతన్స్వనస్గాంచఁగా
క్షితిలోద్వాపర వేళలేఖనమునం♦ సృష్టింతుయద్వత్కలిం
సతతంబుం గరసాధనంబుగదయా♦మ్మజ్జాతకుల్ సేయువి
శ్వతదేవాలయగేహగోపురముల్♦ సధ్యాభసాత్త్వంచిత
ప్రతతుల్ ఘోరితరప్రభావగుణభా♦స్వద్విశ్వకర్మప్రభో.65

మ॥ వరసూదంటను ప్రస్తరావళులచే ♦ బ్రాకార నిర్మాణము
న్వరుసన్జేసిమహాప్రవీణముగనా ♦ ప్రాకారమం దేవుఁగా
సరవిందావక వంశజాతులుమహా ♦ చాతుర్యులై ద్వాపర
స్థిరకాలంబున వాసమొందిరిధరన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 66

మ॥ వరగాంభీర్యసమగ్రధైర్యముననా ♦ ప్రాకారమందుండఁగా
ధరలోనీ కలికాలభద్రగిరి నా ♦ థాధీశుఁడాభూమియున్
సరణింగాంచిసహించలేకదురమున్ ♦ సల్పంగవేంచేసి సు
స్థిరసామర్థ్యములేక నోడిచనిర ♦ క్తివ్యాకులుగ్రస్తుఁడై
పరమవ్యాధినినుండుకాలమునదే ♦ వా! విశ్వకర్మప్రభో. 67

శా॥ శ్రీమద్భద్రగిరీంద్రపుత్రిజనకున్ ♦ జేరంగ నేతత్కథన్
బ్రేమంజెప్పగనన్నుబంపుమనిసం ♦ ప్రీత్యాజ్ఞయున్ బొందియా
భామారత్న ముగొందరంగనలతోఁ ♦ బైనంబునై లేచియు
ద్దామప్రౌఢిమకోటకున్ వెలుపలన్ ♦ దారుండిరుద్యన్మనః
కామోద్రేకసువీక్షణావళులరం ♦ గద్విశ్వకర్మప్రభో. 68

శా॥ ఏతత్సుందరులచ్చటన్నిలువఁగా ♦ నీ వంశవిస్తార వి
ఖ్యాతబ్రహ్మలలోనకొందఱు వయః ♦ కాలార్హుల వ్వేళనం
ప్రీతిన్గాంచిరాఁ దన్మాతు దెలిసి కో ♦ ర్కుల్గలిసం యోగముల్
భాతిన్నల్పిరి కొంతకాలమిల దే ♦ వా! విశ్వకర్మప్రభో 69

శా॥ ఏతద్భామలలోన రాజసుతయం ♦ దిచ్ఛానురాగంబుచేఁ
బ్రీతిన్ శేఖరపూరుషుండొకఁడుకో ♦ ర్కుల్ దీరసంపర్కమున్
ఖ్యాతిన్ సల్పుచునుండన త్తరుణికిన్ ♦ గర్భైనసుపుత్త్రద్వయమున్
చేతోధీశ్వర లోకసృష్టి విభవ ♦ శ్రీవిశ్వకర్మ ప్రభో. 70

శా॥ కాలంబీగతి గాజనన్బిదవఁ త ♦ త్కాంతుండు సిద్ధింప నా
బాలాబ్జాననతండ్రికిన్ బ్రియమునం ♦ పాదించుచిత్తంబుచే
నాలోకించియు కోటగట్టుననల ♦ వ్యాప్తం బడేయంచు నా
భీలాలాపములాడె గుండెలదరన్ ♦ వే! విశ్వకర్మప్రభో. 71

మ॥ అరయంగా నిటుబల్క నాపురుషుడు ♦ వ్యత్యుప్తిమత్తాత్ముడై
పరగన్నారికి నామమైన కసవే ♦ పథ్యంబుగా వచ్చెనం
చురువాక్యంబువచింప తత్సదతియా ♦ యోగంబు వేగాంచిత
త్కారణుల్ తండ్రికిఖోషఁ జేసెగదరం ♦ గద్విశ్వకర్మప్రభో.72

మ॥ పరగన్ దత్సతి వ్యాభిచారపురుషున్ ♦ జాటుంచియాలింగన
స్ఫురదాలాపములం బ్రమింపగనుదా ♦ భూషించిలాలించెనా
లిరువార్తన్ వెసకోటకత్తెంకుఁ జెః ♦ తాపాయమున్ గల్గనా
నరసుల్ గుంపులుగూడి రచ్చటనుభా ♦ స్వద్విశ్వకర్మ
ప్రభో. 73

మ॥ శతమున్వింశతి పంచకంబగు మహా ♦ సద్గోత్రజుల్ తావక
ప్రతివంశోద్భవులచ్చట స్వదలిభా ♦ స్వచ్ఛక్తి కాంచీపురం
బటిరక్తిన్ వెసఁ జేరియావలను త ♦ త్కామాక్షి కాళీకృపా
ంచితులై వేగసమస్తదేశములలో ♦ వ్యాపించిరుద్యద్గతిన్
క్షితిలో కాపురముండి రుత్సవమునన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో.74

శా॥ శ్రీమద్భద్రగిరీశ పుత్రికనిధా ♦ త్రిస్నీదు వంశస్థులా
ధీమంతోగ్రరతి ప్రభావమునర ♦ క్తిన్బుత్రయుగ్మంబున
త్ప్రేమన్ బుట్టియు వర్ణసంకరులనన్ ♦ విఖ్యాతులై యొప్పెడీ

భూమిన్ తావకవంశజాతులకు ని ♦ ర్మోదంబుఁ జేకూర్చియీ
సీమన్ జేతుగుమ్మటవర్తనలుసు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 75

మ॥ కరణీకంబులుపంచకర్మములు వే ♦ గన్ గర్మషట్కంబులన్
ధరలోఁ జేయుచు తావకాత్మజులును ♦ త్స్నేహానురాగాత్ములై
పరసుల్సృష్టి నొనర్చుచున్న ఘనులై ♦ సత్కీర్తి కాంతాహితో
త్కరులై వేడుకతోడనుండిరిలరం ♦ గద్విశ్వకర్మప్రభో.76

మ॥ కలివేళన్ ధరత్వష్టవంశజులు రం ♦ గత్కీర్తికాంతాహితో
జ్జ్వలస్శ్రీ రఘు వీర సేనతనయు ♦ ల్సామర్థ్య లత్యుత్తము
ఖలసంహారులురుద్రమూర్తియునుదీ ♦ ప్తన్ భద్రసేనుండునా
పిలసద్భుముడుధర్మసేనుఁడులస ♦ ద్విద్యాకరుల్కాశిలోఁ
జెలువొంకంచనులై వసించిరలఘు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 77

శా॥ ఏతద్ధీకులు దర్పణంబులును సు ♦ శ్రీతామ్రహేమాదివి
ఖ్యాతానంతసులోహ పాత్రిముఃఖరం ♦ గద్వస్తువుల్ప్రీతిమై
స్ఫీతిన్ జేయుచుఁ గాశికాపురవర ♦ శ్రీవీధితద్విక్రయో
ద్యాతిన్ వాసమునొందియుండగను శం ♦ భచ్ఛంకరాచార్యస
చ్చాతుర్యం డను దెంచెఁ గాశికని ♦ భాస్వద్విశ్వకర్మప్రభో.78

మ॥ అలకంచర్లు సృజించువస్తువులస ♦ త్యాశ్చర్యుఁడై గాంచియా
యలఘు శ్రీకరశంకరార్యమణిచి ♦ త్తానందుఁడై వారితోఁ
బలికెం గంచిపురంబుమీరలుమహా ♦ ప్రావీణ్యతన్ వచ్చినన్
విలసత్కీర్తిన్ సను స్తవస్తుతతులన్ ♦ వే యమ్మగాఁ జేతునా
పలుకుల్ సత్యము వేగరమ్మనెనుభా ♦ స్వద్విశ్వకర్మప్రభో.79

శా॥ హేమంబెత్తుకు నెత్తుగాఁగ్రయము నే♦నమ్మింతు నింపారమీ
సామానుల్వరకంచి కేగుడనినన్ ♦ సంతోషతాత్పర్యులై
సామర్థ్యుల్ భవదీయవంశజులు నా ♦ చార్యాగ్రణిన్మన్ననల్
ప్రేమన్ జేసిక మండలంబునుమహా ♦ విఖ్యాతిగా దండమున్:
కామాక్షీవర విగ్రహంబులిడె రం♦గద్విశ్వకర్మప్రభో. 80

శా॥ అంతన్ శంకరుఁడామహామహులన ♦ త్యాసక్తిదీవించి వే
సంతోషంబున నేగెకంచరులు భా ♦ స్వద్దివ్యకాలంబునన్
జింతల్మాని సుదక్షిణాభిముఖులై ♦ శ్రీయుక్తులై పాత్రలున్
జెంతన్ పంచశతాఖ్యసంఖ్యగలసు ♦ శ్రీయుక్తమౌ పుష్పధీ
మంతుల్కంచోనఁగూర్చిరత్తరిని ప్రే♦మన్ విశ్వకర్మప్రభో. 81

మ॥ అరయన్ వేగనశీతికిన్య వరిసా ♦ హస్రంబులు న్నాల్గువి
స్తరపాత్రాళు లనేకవాజితతిపై ♦ సంధించి నీవంశజ
స్థిరకీర్త్యాదిక రుద్రమూర్తివిపుల ♦ శ్రీరత్నహేమాన్వితో
త్కరమానందల మెక్కిసానుజులు వే ♦ ట్కంగొల్వవాద్యధ్వనుల్
వరగన్ భృత్యసమేతుఁడై వెడలెలీ ♦ లన్ విశ్వకర్మప్రభో. 82

మ॥ అలకాశీపురవాసమున్ వదలి భ ♦ వ్యానందులై కంచయుల్
ఇలలో మధ్యనుగల్గు దేవముల సం♦ప్రీతాత్ములై గొల్చుచున్
లలిత శ్రీబెజవాడఁజేరి పిదపన్ ♦ లావణ్యమగ్గాస్తవం
బులుగావించియు శ్రీగిరిన్ హరుశివున్ ♦ బూజించి కాత్యాయనీ
లలనంగొల్చియు కంచికేగిరటలీ ♦ లన్విశ్వకర్మప్రభో. 83

శా॥ ఆకాంచీపురికేగ శంకరయతీం ♦ ద్రాధీశుఁడు న్వచ్చియు
త్సేకప్రీతినిఁగౌరవించి విడుచు ♦ న్గోరంబుగానిచ్చితా
వీకన్గస్వరి చోళభూపతికినీ ♦ వృత్తాంతముఁ జెప్పెను
శ్లోకుల్తావకవంశజుల్సుగుణవా ♦ సుల్విశ్వకర్మప్రభో. 84

మ॥ అరయఁ తద్ధరణీశుసమ్మతమున ♦ న్నచ్చోట ఘోరాలుసు
స్థిరతంవేసి తదీయపాత్రముఖర ♦ శ్రీవస్తు జాలంబు వి
స్తరమౌయంగడివేసి తత్స్వరమహా ♦ శక్తిఁ జగన్మాతదు
స్తరకామాక్షిని గొల్చిరుత్సుకతభా ♦ సద్విశ్వకర్మప్రభో. 85

మ॥ వరచిత్రస్థితి నీదువంశభవభా ♦ స్వద్వస్తు సందోహముల్
పరగఁ సర్వజనాళి విశ్వసముగా ♦ వాంఛించి హేమంబు వి
స్తరతంరెట్టియొసంగివేగొనిరి సం ♦ తానద్రుమాభోజుల
స్థిరదానాత్ములు తావకాంశజులుసు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 86

మ॥ అరయఁ దర్పణమొక్క టేర్పరచిర ♦ త్యాశ్చర్యయోగంబుగా
సరవిన్రాత్రులు చంద్రకాంతి దివముఁ ♦ చండాంశు కాంతిన్సదా
సురుచిభ్రాజిత దర్పణం బిటులన ♦ స్తోక ప్రభావంబుచేఁ
బరగఁ చోళధరాధినాథసుతయా ♦ వాక్యంబులాలించిసు
స్థిరతఁ దంద్రికిమ్రొక్కియిట్లనియెసు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 87

మ॥ పురిత్వష్టాన్వయసత్కృతోజ్జ్వలమునై ♦ పొల్పొందు తద్దర్పణం
బరశేకిత్తరివచ్చుమార్గమును వే ♦ యాంబోలు తద్వస్తువుం

వరహాలెత్తుగనిచ్చి తెమ్మనుచు బా ♦ స్వత్స్వతియుంబల్కఁగా
పరిచారావళి కంతఁజెప్పి పనిచెన్ ♦ బ్రావీణ్య త్వద్వంశజో
త్కరులన్వేడఁగఁబోయిరంత నటరం ♦ గద్విశ్వకర్మప్రభో. 88

మ॥ నృపుఁడల్లంపిన రుద్రమూర్తియపర ♦ శ్రీకంఠుఁడామోదుఁడై
విపులశ్రీయుతదర్పణంబుఁగొనియా ♦ భృత్యాళియుందానునా
నృపునింజేరఁగ నద్దముంగొని సుత ♦ శ్రీవీక్షణార్థంబునా
నృపుడంతఃపురసీమకంపెఁగద సు ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 89

మ॥ తరువాతం నృపుఁడాత్మలోఁ గుటిలుఁడై ♦ తద్దర్పణార్థంబుగా
పరుషోక్తుల్వచియించె నట్లనిన మా ♦ ప్రావీణ్యపట్టంబు నం
దురునిత్తార్జనఁజేసినాఁగదని ♦ శ్రోత్రాహులై దానికిన్
స్థిరసుంకంబిపుడివ్వఁగావలెననెన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 90

శా॥ సుంకంబా నృపుడిచ్చతోనడిగినన్ ♦ శూలాభమౌ వాక్యముల్
శంకల్మానివచింప ధర్మమె ధరన్ ♦ సత్యంబు వర్తిల్లునే
నింకన్ సుంకముసీకొసంగుదుమె మా ♦ యిష్టార్థమా యుద్ధమే
వంకన్నీవుహరింతువోయనుచు స ♦ ద్యోగ్రాకృతిన్ బల్కెసి
శ్నాంకంజోళ్లునిజూంచిరుద్రుఁడాగిభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 91

మ॥ కలహంబెంతఘటించినన్ మనసులో ♦ కౌటిల్యముల్పూనినన్
జలజాతాసనుఁడేగుదెంచినను స ♦ స్వత్రాణముల్బోయినన్
ఇలలో సుంకముసీకొసంగమనధా ♦ త్రీశుండుకోపాత్ముఁడై
పలికెన్ ఈసభలోన లోపముగనం ♦ భాషించితౌ గానయా

స్థలమున్బాయుమటంచుఁ జోళుడనె భా ♦ స్వద్విశ్వకర్మ
ప్రభో. 92

మ॥ తరువాతన్ వెసరుద్రమూర్తిఘనుడ ♦ త్యారూఢకోపంబుచే
దురనుజ్జేయుదమంచుఁబల్కునృపుఁడున్ ♦ దుర్వారకోపంబుతో
సురుసైన్యంబులబంపనత్తరిమహా ♦ గ్రావేశనారాయణ
స్థిరచక్రంబునతచ్చమూతతులశ ♦ త్రిన్వంచరాజేంద్రుఁడా
సరణింగాంచిభయాత్ముఁడై పలికెభా ♦ స్వద్విశ్వకర్మప్రభో.93

మ॥ కడుకంబుల్లరిచక్రముల్ బనువ నా ♦ క్షోణీశుసైన్యంబులే
పడగన్ ద్రుంచినరాజుభీతిని మహా ♦ యానంబుసంప్రాప్తమై
పుడమిన్ వీరుమహాత్ములంచుఁ జలమున్ ♦ మోదంబుతోమానిదా
షోడగానంజనిరుద్రమూర్తిముఖులం ♦ బూజించిసుంకంబునే
నడుగన్ సత్యముగారితోడనియెదే ♦ వా! విశ్వకర్మప్రభో.94

శా॥ కామాక్షీమణితోడునేనడుగ సుం ♦ కంబంచునిశ్శంకుఁడై
భూమీశుండువచించిదర్పణమున ♦ మోదంబుతోనిచ్చియు
ద్దామప్రౌఢులతావకాంశజుల స ♦ మ్మానించెవిఖ్యాతి సు
త్రామాద్యామరకోటిసన్నుతచరి ♦ త్రా! విశ్వకర్మప్రభో. 95

మ॥ వరకాంచీపురిలోన చోళనృపుచే ♦ పాంచాననోద్భూతులున్
స్థిరపూజల్వానొంది దిగ్విజయులై ♦ క్షేమంబుగానంతటన్
నరవిన్ వారలభీష్ట భావవిధిచే ♦ చాతుర్యులై సౌఖ్యులై
ధరణిన్ గాపురముండి రుత్సవముచే ♦ తన్విశ్వకర్మప్రభో.66

మ॥ కరిణీకంబులు నీదువంశజులకున్ ♦ క్ష్మాచక్రమందుండగా
నరయన్గృత్రిమగోపరాజులరా♦మాఖ్యుండుసర్వంబునున్
ధరణీనాథునిజేరియేడుఘడియ ♦ ల్దానంబుఁగా ముద్రికన్
వరుసన్గోరియునీరసత్వముగభా ♦ స్వచ్ఛక్తి నీవంశ్యులన్
విరసుండై విడిపించె గొంతధరణిన్ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 97

మ॥ కరిణీకంబులు కృష్ణరాయనృపుఁడీ ♦ క్ష్మాపాలనుండౌతరిన్
నరవిన్గృత్రిమ గోపరాజులభా♦ స్వద్రాముఁడావృత్తులన్
ధరణిన్గొంతహరించి యాసచివసం ♦ తానంబు కిప్పించెభా
స్వరతేజోమయుసద్గురూత్తముఁడదే♦వా!విశ్వకర్మప్రభో.98

మ॥ కరిణీకంబులు గొన్ని దేశములకున్♦ గాపత్యరామాఖ్యుచే
ధరణిన్భిన్నత నొందనంతటభవ ♦ త్సంతానులార్యుల్సదా
సరసుల్కోదయుంశోడఖండములుభా♦ స్వత్తేజులై తొమ్మిదిన్
బరిపాలించిరి పంచకర్మములభా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 99

మ॥ అరయన్ గ్రుదనొనర్చిజంతువులున♦ వ్యానందమై వృద్ధిచేఁ
బరగన్సస్యచయంబుపూర్ణముగ బెం♦ పన్గారణంబూనిరి
ద్ధరణిన్దావకపుత్రులుత్తములుచిం ♦ తారత్నసాదృశ్యసు
స్థిరదానాధికచిత్తులార్యులిలలో ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 100

మ॥ సరవిన్గ్రుదలొనర్చివాటివలనన్ ♦ సస్యాదులున్వృద్ధిఁగాఁ
బరగన్మానవముఖ్యజంతువులు సొం ♦ పారంగజీవించుట
బ్బరహావ్యర్థములై చెలంగనిటు నీ♦ క్షోణిన్భవత్పుత్రకు
ల్పరిపాలింపఁగ దేవవిప్రులగుచున్ ♦ భాసిల్లఁగాఁ జేసినా
వరయన్లోహసుకర్మ లేవురను దే♦ వా విశ్వకర్మప్రభో.101

మ॥ కదురుల్జేసి సమస్తమానవులకున్ ♦ త్సాహచక్రమందోపుగా
విదితప్రాభవమానరక్షణకునై ♦ విఖ్యాతిసద్వస్త్రము
ల్సదయన్సృష్టినొసంగిబ్రోతురిలనీ ♦ సద్వంశజుల్యాభిలో
పరమాత్మాపరమేశసద్గురుఁడ భా♦స్వద్విశ్వకర్మప్రభో. 102

మ॥ వరఖడ్గంబులొనర్చివానివలనన్ ♦ బాహాబలోద్దాములై
ధరణీనాథులుసంగరంబులమదో ♦ ద్దామారులంద్రుంచిసు
స్థిరరాజ్యంబువశంబునొనటుల చిం ♦ తన్వాపికుర్వీస్థలిన్
పరమాత్మాభవదీయవంశజులు దే♦వా! విశ్వకర్మప్రభో.103

మ॥ ధరలోహైదరబాదలోనమును చిం ♦ తారత్నసాధృశ్యస
త్పురుషుల్తావకవంశజాతకులుసం ♦ తోషించి సన్మల్లిభన్
వర రాజోచిత బాధతాతుఁలగుచుం ♦ బాదంబులంబట్టి వి
స్తరణోచ్ఛిష్టసుభోజ్యనీయులగునై♦శ్యాల్లిన్గృపన్నల్వురన్
గరుణన్బ్రాణమునిల్పిగాంచిరిలరం♦గద్విశ్వకర్మప్రభో.104

మ॥ పదియుఁ రెండునునాల్గునైదుశతముల్ ♦భావింపఁగానిష్కము
ల్సదయఁ వైశ్యులకిచ్చి దండుగనుభా ♦ స్వత్కీర్తిఁగామాన్పినిం
పుఁదలిర్పంగనుసేమమున్నని కృప ♦ న్బోషింతురెలప్పుడా
పదలేకుండగ నీదువంశజులు దే♦ వా! విశ్వకర్మప్రభో.105

మ॥ సరసాగ్రేసరులర్థిపోషకులుభా ♦ స్వత్కీర్తికాముల్సుభా
కరులీభూమినిగల్గుతావకకుల ♦ ఖ్యాతైకయావన్మహా
పురుషాళిన్గరుణాంబు రాశివగుచు♦న్బోషించుచున్వృత్తిప
న్నిరుతెల్లప్పుడొసంగి సద్గుణాగణ ♦ శ్రీవిశ్వకర్మప్రభో. 106

మ॥ అరయన్మంగళమాశ్రితావనగణ ♦ వ్యాపారికిన్నిర్జరో
త్కరరక్షాయతచిత్తశీలికిని భ ♦ క్తానందచారిత్రవి
స్తరకళ్యాణగుణాగ్రగణ్యునకురా ♦ జన్మూర్తికిన్మీకు నా
కరమానిత్తరిమంగళంబగును దే♦వా! విశ్వకర్మప్రభో. 107

శా॥ భారద్వాజమునీంద్రగోత్రజుఁడనా♦ పస్తంభసూత్రుండ నిం
పారన్ బండరు పల్లెవంశజుఁడదే ♦ వాధీశ కాళీకృపా
సారోదార కవీంద్రుఁడన్జగతి ను♦ ష్మద్వంమాహత్మ్యమున్
సారశ్రీశతకంబొనర్చితిని భా ♦ స్వద్విశ్వకర్మప్రభో. 108

కం॥ వరరామకృష్ణసుకవి
విరచించితిశతముపద్య ♦ వివరంబులునే
ధరనాచంద్రార్కముగాఁ
బరగన్వరవిశ్వకర్మ ♦ పరివృఢవర్యా.





# మనసు ఫౌండేషన్
# పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KEHO 113 316 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 4-10-2023 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 1, 19, 22, 25 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Mounika |
| పేజీలు విడదీసినది | Mounika |
| స్కాన్ చేసినది | Amrutha |
| పరీక్ష చేసినది | mounika |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |